


# ఈ రోజుల్లో తలనొప్పి అంటే మాటలా!

# సాలోఫేన్ ను వాడండి. అమోఘంగా నొప్పులను నివారించే విశిష్టమైన మాత్ర. వెల అతిచౌక

మంచి నొప్పుల నివారిణి సాలోఫేన్‌ను గమనించండి. దీనిలో రెండు మందులు అమోఘంగా నొప్పులను పోగొట్టేవి చేరివున్నాయి—ఆస్ప్రిన్, ఫెనాసిటిన్—అయినప్పటికీ వెల మాత్రము 7 పైసలే ఒక మాత్ర. సాలోఫేన్ అతిశీఘ్రంగా, తలనొప్పులకు జలుబులకు పండ్లనొప్పి. ఫ్లూ జ్వరాలకు కండలనొప్పులకు ఉపశమనం కల్గిస్తుంది.

సాలోఫేన్ నొప్పుల నివారిణి మాత్రలు—ఏళ్ళతరబడి ఇంటింటా ప్రసిద్ధిపొందిన అమృతాంజన్ లిమిటెడ్ వారి తయారీ.

అమృతాంజన్ లిమిటెడ్ వారి నమ్మకమైన తయారీ

**సాలోఫేన్**
అమోఘమగు నిరపాయకరమైన నొప్పుల నివారిణి

SAA/AMS/2197 TEL




# ఎందుకనగా మీరు నెగ్గడమే మాకు కావాలి

**Prestige**

## ప్రెషర్ కుకర్ యొక్క గొప్ప బహుమతుల పోటీ

**-ఫిబ్రవరి 15,1977 వరకూ మేము గడువు తేదీని పొడిగిస్తున్నాం.**

4 విజయ్ స్కూటర్లు — మరియు 100 పైగా ఇతర గొప్ప బహుమతులు విజేతలకోసం నిరీక్షిస్తున్నాయి:

ఔను, ప్రెస్టీజ్‌తో మీరు విజేత కావడానికి మేము పోటీని పొడిగించాం. ఇప్పుడు మీరు ప్రెస్టీజ్ ప్రెషర్ కుకర్‌ని ఫిబ్రవరి 15 వరకూ కొనుక్కోవచ్చు. ఫిబ్రవరి 28 లోపున మాకు అందేలాగా మీ ఎంట్రీని పంపవచ్చు.

పోటీ పూర్తి వివరాలకి, ప్రవేశ పత్రాలకి మీ దగ్గరిలోనున్న ప్రెస్టీజ్ డీలర్‌ని ఈ రోజునే సంప్రదించండి.

ముగింపు తేదీకి ఆరువారాలలోగా పోటీ ఫలితాలు ప్రకటించబడతాయి.

టిటి. (ప్రైవేట్) లిమిటెడ్
బెంగుళూర్ 560 016







SAA/TTP/2465 TEL

## లోకంపోకడ — డోమెన్










# ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాధుని
నాగేశ్వరరావు పంతులుగారు
స్థాపితం : 1908
శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు
[1938-1972]
శుక్రవారం : 21-1-'77
నలనామ సం. మాఘ శు. నవమి
సంపుటము 70 : సంచిక 22
సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ
*
పోస్ట్‌తో ఏడాది చందా రు. 41 60
" ఆరుమాసాల చందా రు. 20-80
విడి పతి వెల 75 పైసలు
ఆంధ్రపత్రిక కార్యాలయము
గాంధీనగరం, విజయవాడ- 520003.

## విషయానుక్రమణిక



# హైదరాబాద్ నోట్‌బుక్ —తిరుమల రామచంద్ర

## కాంగ్రెస్ 91వ వార్షికోత్సవము

భారత జాతీయ కాంగ్రెస్ 91 వ జన్మదినోత్సవం సందర్భంగా డిసెంబర్ 28 న గాంధిభవన్‌లో జరిగిన సభలో ముఖ్యమంత్రి ప్రసంగిస్తూ, దేశ ఆర్థిక స్వాతంత్ర్య సాధనకై ప్రజలను సమాయత్త పరచవలసిందిగా కాంగ్రెస్ కార్యకర్తలను ఉద్బోధించారు. పార్టీ సిద్ధాంతాల ఆచరణకు ప్రతి కాంగ్రెస్ వాదీ ప్రతిజ్ఞ చేయాలనీ ఆయన కోరారు. కాంగ్రెస్ ప్రజా సంక్షేమానికి, దేశాభ్యుదయానికి అంకితమైన మహా సంస్థ అని రాష్ట్ర కాంగ్రెస్ సంఘాధ్యక్షుడు శ్రీ మునలయ్య అన్నారు. శ్రీయుతులు సర్వారెడ్డి, సయ్యద్ రహమతుల్లా, కొత్తూరు సీతయ్యగుప్త, టి. హయగ్రీవాచారి కాంగ్రెస్ సంస్థ జరిపిన పోరాటాలను వివరించారు.

## కళ్ళకు శాసనం

వైద్యవిద్యా బోధనావకాశాలు గల ఆస్పత్రులలో మరణించే వారి కనుగ్రుడ్లు తీసుకొనడానికి అధికారమిచ్చే శాసనాన్ని చేయడానికి రాష్ట్ర ప్రభుత్వం ఆలోచిస్తున్నదని ఆరోగ్య శాఖమంత్రి శ్రీ రాజమల్లు డిసెంబర్ 29 వ తేదీన రోటరీ కాన్వెంటు బాలికోన్నత పాఠశాలలో థోయస్స్ నేత్ర నిధి సంఘానికి ప్రారంభోత్సవం జరిపినపుడు సూచించారు. ఈ నిధి సంఘం మంత్రికి 250 మంది తమ నేత్రాలను మరణానంతరం ఇవ్వడానికి వ్రాసి యిచ్చిన వీలునామాలను అందజేసింది. ప్రఖ్యాత నేత్ర వైద్యుడు డాక్టర్ పి. శివారెడ్డి కృత్రిమమైన కనుగ్రుడ్ల తయారీకి ప్రపంచమంతా పరిశోధనలు జరుగుతున్నాయని అన్నారు. నేత్ర నిధి సంఘ గౌరవ కార్యదర్శి టోకర్సీలాల్ కపాడియా, థోయస్స్ సంస్థ అధ్యక్షుడు శ్రీ ప్రేమకుమార్, కార్యదర్శి శ్రీ ఉదయకుమార్ మున్నగు వారు ప్రసంగించారు. ఇలాటి శాసనం చేయడం ఎంత ప్రయోజనకరం. ఈ శరీరం మరణానంతరం వ్యర్థం కాకుండా కాకులకు గద్దలకు వేయాలని పార్శీల సంప్రదాయం. ప్రధానాంగాలు ఇతరులకు ఉపయోగపడితే ఎంత సంఘ శ్రేయస్సు! నా మిత్రుడు శ్రీనివాసచక్రవర్తి తన కన్నులను ఇతరులకు వినియోగించాలని వీలునామా వ్రాసి మరణించారు. అది అమలు కూడా అయింది.

## తెలుగు అకాడెమీ నూతన భవనం

పింగళ సంవత్సరం ఉగాది పండుగనుంచి రాష్ట్ర స్థాయిలో తెలుగును పరిపాలనా భాషగా ప్రవేశపెట్టడానికి తెలుగు అకాడెమీ కల్పిస్తున్న దోహదం అపారమైనది. ఇంత వరకు ఇది 426 పుస్తకాలు ప్రచురించింది. డిగ్రీ స్థాయి వరకు తెలుగును బోధనా భాషగా చేయడానికి దీని కృషే కారణం. గోండు, కోయ భాషలను తెలుగు లిపి వాడడానికి పాఠ్య గ్రంథాలను సిద్ధ పరుస్తున్నది. వివిధ మాండలికాల సర్వే జరుగుతున్నది. ఇంతటి కార్యకలాపాలకు తగిన నూతన భవనం ఏడు లక్షలలో నిర్మించినట్టిది ఎనిమిది సంవత్సరాల అపూర్వ కృషితో సగర్వంగా, సుందరంగా దర్శనమిస్తున్నది. దీనికి జనవరి 1 వ తేదీన ముఖ్యమంత్రి శ్రీ వెంగళరావు ప్రారంభోత్సవం చేస్తూ తెలుగు భాషాభివృద్ధికై కృషి చేస్తున్న తెలుగు అకాడెమీ, సాహిత్య అకాడెమీ, అంతర్జాతీయ తెలుగు సంస్థ కార్యక్రమాలలో సమన్వయం ఉండాలని సూచించారు. అకాడెమీ చేసిన కృషిని ప్రారంభోత్సవానికి అధ్యక్షత వహించిన విద్యాశాఖ మంత్రి శ్రీ మండలి వెంకటకృష్ణారావు వివరించారు. అకాడెమీ మొదట్లో ఎదుర్కొన్న ఇబ్బందులను గురించి వ్యవస్థాపకాధ్యక్షుడు మాజీ ముఖ్యమంత్రి శ్రీ పి. వి. నరసింహారావు వివరించారు. ప్రారంభంలో అకాడెమీ ఉపాధ్యక్షులు, విద్యాశాఖ కార్యదర్శి శ్రీ చావలి శ్రీనివాసశాస్త్రి స్వాగతం చెప్పారు. అకాడెమీ డైరెక్టర్ శ్రీ ఎన్. వెంకటస్వామి కృతజ్ఞత చెప్పారు.

## బాలల కోసం చారిత్రక చిత్రాలు

పిల్లలకోసం రాష్ట్రంలోని చారిత్రక స్థలాల చలన చిత్రాలను ప్రభుత్వం నిర్మించదలచిందని విద్యామంత్రి శ్రీ మండలి జనవరి 2 వ తేదీన ఆంధ్ర సారస్వత పరిషత్తు హాలులో డాక్టర్ సముద్రాల ఆంజనేయులు రచించిన నాగార్జున కొండ కావ్యాన్ని ఆవిష్కరించినప్పుడు సూచించారు. నాగార్జున కొండ కావ్యం నాగార్జున కొండ ప్రజలకు ఇచ్చిన సంస్కృతిని మనోహరంగా వర్ణించిందని మంత్రి ప్రశంసించారు. రాష్ట్రంలోని ఇతర సాంస్కృతిక కేంద్రాలను గురించి ఇతర రచయితలు ఇలాటి గ్రంథాలు రచించాలని ఆయన కోరారు. శ్రీ దేవులపల్లి రామానుజరావు అధ్యక్షత వహించారు. శ్రీయుతులు కేశవపంతుల నరసింహశాస్త్రి, టి. ఎన్. శేషాచార్యులు, కోటవీరాంజనేయ శర్మ కుమారి వాసిరెడ్డి సీతాదేవి కావ్య విశేషాలు వివరించారు.

## ముక్కోటి ఉత్సవాలు

జంటనగరాలలోని విష్ణ్వాలయాలలో ధనుర్మాస సందర్భంగా జరుగుతున్న ఉత్సవాలతో పాటు ముక్కోటి ఏకాదశి ఉత్సవం జనవరి2వ తేదీన మహోత్సాహంతో జరిగినది. ఒక వైపు ఎంత నాస్తిక్యపు ప్రచారం ముమ్మరంగా కొనసాగుతున్నా దేవాలయాలలోని త్రొక్కిడి చూచినవారికి ఆశ్చర్యం కలుగుతుంది. సైదాబాద్‌కాలనీ రామాలయంలో, నల్లకుంట రామాలయంలో విశేష పూజలు జరిగాయి. నల్లకుంట రామాలయంలో మహాకవి, మహావ్యక్త శ్రీ పుటపర్తి నారాయణాచార్యులు తిరుప్పావై కాలక్షేపాలు జరుపుతున్నారు. కొందరు తమ ఇళ్ళలోను భజన కాలక్షేపాలు ఏర్పాటుచేశారు. ఇలాటి వాటిలో పేర్కొనదగినది ఉస్మానియా విశ్వవిద్యాలయం ఆర్ట్సు కాలేజి వైస్ ప్రిన్సిపాల్ డాక్టర్ ప్రమోద్ గనేశ్ లాల్యే ఏర్పాటు చేసిన భజన గోష్ఠి. దీనిలో ఔత్సాహిక గాయనీ గాయకులు పాల్గొన్నారు. వీరందరూ చాలా వరకు విద్యార్థినీ విద్యార్థులు. ఆనంద్ మోఘే (ఇ.సి.ఐ.ఎల్.లో ఇంజనీరు) హిందూస్తానీ సంగీతంలో పూరియా రాగాన్ని గంటసేపు ఆలపించారు. కృష్ణఫణి సితార్ వాయించారు. కుమారి అర్చనా లాల్యే, కుమారి వందనాలాల్యే, కుమారి సునీతాధన్ పత్‌వార్, శ్రీమతి దినకర్ దేశపాండే హిందూస్తానీ భజనలు గానం చేయగా, కుమారి కె. శారద, కుమారి కె. నిర్మల కర్నాటక సంగీతం కృతులు పాడారు. ఈభజన కార్యక్రమాన్ని హిందూస్తానీ సంగీతాచార్యుడు శ్రీశిండే నిర్వహించారు.

## ఆదర్శ మహిళామండలి కార్యకలాపాలు

వెంగళరావు నగర్ [యూసఫ్‌గుడా] ఆదర్శ మహిళామండలి డిశంబరు చివరివారంలో గాంధి భవన్‌లో ఏర్పాటు చేసిన సాంస్కృతికోత్సవానికి అధ్యక్షత వహించిన రాష్ట్ర సాంఘిక సంక్షేమ సలహామండలి అధ్యక్షురాలు శ్రీమతి చెల్లాయమ్మ గోవింద కృష్ణయ్య ప్రసంగిస్తూ, శిశుసంక్షేమానికి, సమాజాభ్యుదయానికి మహిళాసమాజాలు ఇతోధికంగా కృషి చేయాలన్నారు. మండలి కార్యదర్శిని శ్రీమతి ఎం. మహాలక్ష్మి మండలి కార్యకలాపాలు వివరించారు. మండలి నృత్యం, సంగీతం, హిందీ, టైలరింగు తరగతులు, గ్రంథాలయం నిర్వహించడమే కాక వరకట్న నిషేధం, కుటుంబ నియంత్రణాది కార్యకలాపాలు సాగిస్తున్నదని కొన్నికుటీర పరిశ్రమలను ఏర్పాటు చేయదలచామని ఆమె తమ నివేదికలో తెలిపారు. శ్రీమతి ఆర్. విజయప్రసాద్ ఆధ్యాత్మ రామాయణం అభినయం, భామాకలాపం ప్రదర్శించారు. పరిశ్రమ వాణిజ్య శాఖ సాంస్కృతిక సంఘం శ్రీ కొడాలి గోపాలరావు రచించిన చేర్మన్ నాటకం, శ్రీ ఓగిరాల గోపాలకృష్ణమూర్తి దర్శకత్వంలో ప్రదర్శించారు. శ్రీమతి లక్ష్మీరామమూర్తి నర్తకి శ్రీమతి విజయప్రసాద్‌ను ఇతర కళాకారులను సన్మానించారు. ప్రముఖ రంగస్థల నటుడు శ్రీబుర్రా సుబ్రమణ్య శాస్త్రి నాటకంలో పాల్గొన్న నటులను సత్కరించారు. ప్రారంభంలో శ్రీమతి వై. లక్ష్మీప్రసన్న స్వాగతం పలికారు. చివరన మండలి కోశాధికారిణి శ్రీమతి ఆర్. సూర్యావతి వందన సమర్పణ చేశారు.

## ఉపశ్రుతి :

"చూశారా? కర్నాటక రాష్ట్రంలో పెండ్లి ఖర్చులను ఐదువేలకు మించితే విలాసపు పన్ను విధించడానికి చట్టం చేశారట!" అన్నాను ఒక సంఘ సంస్కర్తతో. "చట్టాలకు సంస్కారాలు మంత్రాలకు మామిడికాయలు రాలుతాయా? మన మనస్సులలోను పరివర్తన జరుగాలి కానీ, తలలు బోడులైన తలపులు బోడులా అని వేమన ఊరికే అన్నాడా?" అని మూతి విరిచారు ఆయన.

# 1976 దీపావళి కథలు

సమకాలీన పరిస్థితులను ప్రతిబింబింప చేస్తూ సంఘంలోని లోటుపాట్లను ఎత్తి చూపి వాటికి పరిష్కారమార్గాన్ని కూడా కథలో వివరించినట్టయితే అట్టి కథ నాదృష్టిలో ఉత్తమ కథగా భాసిస్తుంది. ఆ వరవడిలో చూసినట్లయితే దీపావళి కథలలో బహుమతి నందిన వాటిలో 'గొడుగు' కథ ప్రథమస్థాన మలంకరిస్తుంది. నిరుద్యోగ సమస్యతో ఇతరత్రా వెరిపోకడలు పోతూ బాధ్యతలను విస్మరిస్తున్న నేటి యువతరానికి కనువిప్పు కలిగిస్తుంది 'గొడుగు' కథ.

ద్వితీయ స్థానంలో 'వేంకటస్వామి' కథ వస్తుంది. ఉద్యోగనిర్వహణలో ప్రాణాలను సహితము లెక్కచేయక తన విద్యుక్త ధర్మాన్ని నెరవేర్చిన హెడ్ వెంకటస్వామి వంటి ఉత్సాహవంతులైన ఉద్యోగులకు ప్రమోషనులు ఇవ్వట ద్వారా ప్రోత్సాహపరచ వలసిన బాధ్యత మనదేశంలోని ఉన్నతాధికారులకు ఉన్నది.

'ఫోటో' కథకు తృతీయస్థాన మివ్వడమైనది. అసహాయురాలైన ఆడపిల్లల మనసులో మొగ్గతొడిగిన అతిసామాన్యమైన కోరిక సహితము రక్తసంబంధీకుల అలక్ష్యమువల్ల తీరని కోరికగా పరిణమించి ముదివయసులో మనస్తాపము కలిగిస్తుందని కథారూపములో తెలియజేశారు రచయిత వాస్తవిక సంఘటనలతో, సముచిత సంభాషణలతో సాగిన ఈ కథ నాకు చాలా నచ్చినది. మాతృమూర్తి ఎడల పిల్లలకుండవలసిన బాధ్యతలు, ఫోటో కథలో వ్యక్తపరచారు రచయిత.

'ఇంకో సరిత కథ'కు చతుర్థ స్థానము యిస్తున్నాను. ఈ కథలోని నాయిక సరితకు అతి చిన్న వయసులో వైధవ్య భారముతో పాటు మూగ పిల్లనాడి భవిష్యత్తు కూడా ప్రశ్నార్థకమై నిలబడినది. సెంటిమెంటల్ వాల్యూ తప్ప ఈ కథలో చెప్పుకో తగిన ప్రత్యేకత లేకపోయినా చదివినంతసేపు విసుగు కలిగించక సాఫీగా సాగిన కథా గమనము నాకు నచ్చినది.

ప్రేమ కథలలో ఒక నూతన ప్రక్రియ 'సముద్రం' కథ. విరిసీ విరియని వయసులో అనుకోని పరిస్థితులలో లభించిన ఒక ప్రేమానుభవాన్ని ప్రేమికులిద్దరు కలకాలము ఒక తీయని అనుభూతిగా జ్ఞాపకముంచుకుంటారు. ప్రేమ కథను ఇతి వృత్తముగా తీసికొనిన 'సముద్రం' కథలోని సముద్ర తీరపు వర్ణనలు, ప్రకృతి సౌందర్య చిత్రణ ఈ కథలో నాకు నచ్చిన అంశాలు.

దీపావళి కథల పోటీ యందు గెలుపొందిన ఐదు కథలు వేరు వేరు కథా వస్తువులతో కూడి, వివిధ రుచులతో కూడిన విందు భోజనము చేసిన అనుభూతిని నాకు కలుగ జేసినవి.

– శ్రీమతి జి. కుసుమకుమారి

ఖర్గపూర్.




పి. ఎస్. ఎన్. కుల్‌దీప్ (ఒరిస్సా)

కె. రా గారూ ఆడవాళ్ళకి సమాన హక్కులు కావాలంటున్నారు. హక్కులు రాకపోతే ఏం చేస్తారు ? ఈ శతాబ్దంలో రావు.

నిజమే మీలాంటి వాళ్లిలా ఆలోచిస్తున్నన్నాళ్ళు హక్కులు రావని ఆడవాళ్ళకే తెలుసు. ప్రయత్నం మాది ఫలితాలు కాలం నిర్ణయించాలి అన్న దృక్పథంతో జరుపుతున్న ఉద్యమం ఇది ఇక—కపోతే ఏం చేస్తారు ? అంటున్నారు ఇన్నాళ్ళూ పడివున్నారు. ఇప్పుడిక అసంతృప్తితో పడి వుంటారంతే. కాని బానిస మనస్తత్వానికీ, యీ అసంతృప్తికీ చాలా తేడావుంది. బానిస మృత్యువే విముక్తి అనుకుంటాడు. అసంతృప్తికి ముందు మొండి తిరుగుబాటు అనిపిస్తుంది.

టి.ఏ. కొల్లగుంట

మనిషి జీవించడానికి దారి చూపలేని నేటి చదువులు ఎందుకు పనికి వస్తాయి ?

డిగ్రీ రాడానికి. దానికే కద యీ సంఘంలో విలువ ?

జె. ఎస్. హైదరాబాదు

అబద్ధాలు ఆడితే ఆడపిల్లలు పుడతారని ఆడవాళ్లే మగవాళ్ల దగ్గిర అంటూ వుంటారు కదా, మరి స్త్రీకి స్వజాతిమీద సదభిప్రాయం లేనట్టే కద.

స్వజాతిమీద లేకపోవడం కాదు. కనేది తనే అయినా కారకుడు మగవాడు కనుక 'అబద్ధం ఆడితే నాకు ఆడపిల్లలు పుడతారని' చెప్పాలి.

జె. డి. బి. విజయనగరం

అందాన్ని అమ్ముకొనే ఆడదానికి, మనసు నమ్ముకునే ఆడదానికి తేడా ఏమిటి ?

ఒకరికి ఏమి చేస్తుందో తెలుసు. రెండో ఆమెకి ఏమి చెయ్యాలో తెలియదు. అంతే.

డి. జె. ఎల్. హైదరాబాదు

ఆడదాన్ని ఎందుకండీ గౌరవించడం ?

ఆడదాన్ని గౌరవించు. నీ ఈ దైనందిన జీవితంలో సౌరభాలు వెదజల్లి సుఖవంతం చేస్తుంది.

చెత్తా చెదారం చేరకుండా వుండాలంటే ?

ఒకటే సూత్రం అందంగా లేనిదీ, అవసరం లేనిదీ ఏదీ ఇంట్లో వుంచకూడదు.

ఎదుటివారి కష్టాలు తెలుసుకోడం సాధ్యమా ?

కాదు. ఇంటివాళ్లు కాని వాళ్లెవరూ ఆ ఇంటి వ్యక్తుల ఇబ్బంది ఏమిటని చెప్పలేరు.

పి. వి. ఆర్. గుడ్లవల్లేరు

వినాయకుణ్ణి చూసి చంద్రుడు నవ్వితే చంద్రుని చూసిన వారికి నీలాపనిందలు కలగాలని పార్వతి శపించింది. ఇదేం న్యాయం ?

ఏ తల్లి తన కొడుకు అంద వికారి అని ఒప్పుకోదని "దానికి అర్థం నా కొడుకుని చూసికాదు, అతన్నిచూసి నవ్వినవాడే కారణం" అని ఆవిడ గరిభావన.

# ప్రశ్నావళి

కె. రామలక్ష్మి

ఏ. వి. ఎస్. ఖమ్మం

ప్రశ్నావళి శీర్షికను చక్కగా నిర్వహిస్తున్నందుకు అభినందనలు. మీరు ప్రవేశపెడుతున్న భావాల వల్ల ఆడపిల్లలతోపాటు మగపిల్లలు కూడా బాగుపడేందుకు అవకాశం వుంది. ఇందిరాగాంధి ఆచరణలోకి తేదలుచుకొన్న స్త్రీ పురుష సమానత్వానికి ఇటువంటి భావాలే పునాదులు.

చాలా సంతోషం శాస్త్రిగారూ, అప్పుడప్పుడు ఇలాటి పుత్తరాలు లేకపోతే నాకే ఉత్సాహం వుండదు. థ్యాంక్యూ.

ఎస్. ఎమ్. ఎల్. సనత్ నగర్

స్త్రీ పురుషుని ఎంతవరకూ నమ్ముతుంది ?

తాను పూర్తిగా మునిగి పోయేంతవరకు !

ఎ. ఎమ్. విజయవాడ

నేను భావిలోకి వద్దామనుకుంటున్న యువ కార్యాలు నిస్తని...ఎల.

ఇంకేం ? ఏ పులిచెర్ల దగ్గరో, ఏ దాగిపండరి దగ్గరో శిష్యరికం చెయ్యి కార్ట్యూను ఎలా వేయాలో, ఎలా పంపాలో నేర్పించేస్తారు.

ఇ. జె. ఆర్. ఏలేటిపాడు

..ఇదే విధంగా పత్రికలు సమాధానలిస్తూంటే కొద్ది కాలానికే సమాజానికి స్త్రీ జాతి మీద వున్న ప్రేమ అభిమానం గౌరవం పోతాయి.

అంతేకద ! అమ్మలే దానిపోయే పుక్కులాంటి ఉన్నా ప్రేమా అభిమానం గౌరవాలు ఏవైనా శాశ్వతమైన విలువలు ఏర్పడతాయేమో, ఆలోచించండి.

ఎ. ఎన్. ఆర్. సికింద్రాబాదు

మగవాడిని బాధించేవి ?

రెండు. వంట వచ్చి వండని పెళ్ళాం!

వంట రాక వండే తీర్మానసే పెళ్ళాం!

ఎమ్. బిహెచ్. సిరిసిల్ల

సహనం శాంతం స్థైర్యం స్త్రీల సొత్తంటారు కదా మరి పత్రికల్లో భర్తను భార్య ఆడిస్తున్నట్టు కార్ట్యూనులు వస్తూంటాయి.

అదంతే కార్ట్యూనిస్టు తీరని కోరికల్ని బొమ్మలు గీస్తూ ఆనందిస్తాడేమో.

## భర్తకి చుక్కెదురు భార్య ఆత్మహత్య

తిరుచ్చికి చెందిన చిన్నకృష్ణన్ అనే అతడు శతవిధాల ప్రయత్నించినా వుద్యోగం దొరకలేదట. తనకు డ్రయివింగ్ వచ్చినందువల్ల కనీసం డ్రయివరుగానయినా ఎక్కడైనా ఉద్యోగం సంపాదించవచ్చన్న ఆశతో తన భార్య 20 ఏళ్ళ దుర్గాదేవిని ఆమె చెల్లెలింటివద్ద వుంచి, తాను ఆ ప్రయత్నంలో పడ్డాడట. ఆశపడ్డట్టుగాగాక, అక్కడా చుక్కెదు రవటంతో, తన భర్త ఇక నిరుద్యోగంనుంచి... అవన్నీ ఊహించుకుని, దుర్గాదేవి తన చెల్లెలింట్లో దూలానికి వురేసుకుని ఆత్మహత్య చేసుకున్నదట.

## ఆత్మహత్యకి దారితీసిన ప్రేమ

కేరళ రాష్ట్రానికి చెందిన 21 ఏళ్ళ అల్ఫాన్స్ అనే కుర్రాడు ఎస్.ఎల్.ఎల్.సి. ప్యాసయి ఏవుద్యోగం రానందువలన సేలంలో ఓ హోటలులో సర్వర్‌గా స్థిరపడ్డాడుట. అతనో అమ్మాయిని విపరీతంగా ప్రేమించి, పెళ్ళి చేసుకుందామని వాళ వాళ్లను అడిగితే, పిల్లతల్లి దండ్రులు కట్ వీల్లేదన్నారట. ఆమెను రహస్యంగా కలుసుకుని ఏర్కాడుకు రమ్మన్నాడట. అతను ఏర్కాడు వెళ్ళి ఆమెకోసం ఎదురు చూసాడుట. ఆమె రానేలేదట. దాంతో మనస్సు విరిగిపోయి అక్కడి సరస్సులో దూకి ఆత్మహత్య చేసుకున్నాడుట.

## కట్టుకిడబ్బడిగిన కాంపౌండరు

తిరుప్పూరు తిరుమురుగన్ పూండికి చెందిన 24 ఏళ్ల రామస్వామి అనే ఆయన కోయంబత్తూరులో కుటుంబ నియంత్రణ ఆసుపత్రిలో 'ఆ' ఆపరేషను చేయించుకున్న నాల్గోరోజుకు కట్లు కదిలాయట. దాంతో మళ్లీ ఆసుపత్రికి వెళ్తే, డాక్టరు తిరిగి కట్లు కట్టమని కాంపౌండరుకు చీటీ రాసిచ్చారట. కాంపౌండరు ఆచీటీని చూసి ఆప

## 'బేడీ' కుమారుడు గవాస్కర్

భారత క్రికెట్ జట్టు నాయకుడు బేడీ తన కొడుకు పేరు 'గవాస్కర్' అని పెట్టుకున్నాడుట. వెస్టుయిండీస్‌లో గవాస్కర్ చాలా గొప్పగా బ్యాటింగ్ చేశాడు. దీనికి మురిసిపోయిన 'బేడీ' తన కొడుక్కి యీ పేరు పెట్టుకున్నాడుట! గవాస్కర్ 1971లో వెస్టుయిండీస్ ఇండియాల మధ్య జరిగిన 5 వ టెస్ట్‌లో డబుల్ సెంచురీ కొట్టాడు.

# ఫెల్క్వాని డైరి

రేషను పేరుతో నూరో నూటయభయ్యో లాగావు కదా ! యీ కట్టుకు డబ్బు కట్టు అని తగాదా వేశాట్ట. రామసామీ విషయాన్ని తిరిగి డాక్టరుకు రిపోర్టిస్తే "నేజెప్పానెప్పే" అన్నారట. ఆ కాంపౌండరా ఖబురు కూడా ఖాతరు చెయ్యక పోపోయ్ అని ఆరామస్వామిని తోశాట్ట. ఆఘర్షణలో రామసామికి ఆపరేషను కదిలి, రక్తం కారిపోయి పడిపోయాడట.— తరువాత !! పోలీసులొచ్చి ఒకర్ని లాకప్‌కు, మరొకర్ని ఆసుపత్రికి లాక్కుపోయారుట.

## వంటకాలు, పాత్రలతో సహా భక్తుల అరెస్టు

కేరళ, తమిళనాడు రాష్ట్రాల సరిహద్దులో కేరళ రాష్ట్రంలో కణ్ణగి కోవెల వుందట. ఈ కోవెలలోని అమ్మవారికి మేక, గొర్రెపోతు మొదలైనవి బలియిచ్చి, 21 మంది తమిళ నాడుకు చెందిన భక్తులు ప్రార్థనలు జరుపుతుంటే కేరళ పోలీసు చట్టున వచ్చి వారందర్నీ గాక, వారి వంటకాలనూ, పాత్రలనూ కూడా అరెస్టు చేసి పట్టుకుపోయారట. అదేమంటే మా రాష్ట్రంలో వున్న దేవాలయానికి మా అనుమతిలేనిదే వచ్చి ఇట్టే నైవేద్యాలూ అవీపెట్టి పూజలు చేస్తారా మీరు ! అందుకనే "యూ ఆర్ అండరరెస్ట్" అన్నారట. వార్నీ ! ఆమూక్కి తెలిపితే ఐదువేలు !

దూబాయ్ దేశానికి చెందిన మహమ్మదు లూదా అనే అతను గుజరాత్ రాష్ట్రంలో విదేశ వస్తువులు నల్ల బజారులో అమ్మే నేరం మీద మన దేశపు అవసర చట్టం పేర అరెస్టయి, అమరావతి జైలులో వున్నాడట. అతని మీద మరో కేసు బొంబాయి కోర్టుకు విచారణకు వచ్చిందట. దానికోసం ఓ ముగ్గురు పోలీసులతో లూదాను బొంబాయి పంపారట. బొంబాయి వెళ్లగానే అతని ప్రియురాలు ఫాతిమా వచ్చి, అతన్ని కలిసిందట. తానూ తన ప్రియురాలూ కలిసి ఓ హోటల్లో వుండడానికి లూదా ప్రభుత్వ అనుమతి కోరాడట. అది దొరకనందువల్ల ఇహవేరే ప్లానేసుకుని తనతో వచ్చిన పోలీసులతో ఎంచక్కా బొంబాయి చూద్దాం. రైలు కింకా బోలెడు టైముంది కదా అన్నాడట. వారూ సమ్మతించేసరికి ఓ టాక్సిని పిలిచాడట. డ్రయివరు పక్కనా. అతను. అతని ప్రియురాలూ ఎక్కికూర్చున్నారట. పోలీసులు వెనుక సీటులో ఎక్కి కూర్చునేలోగా ఆ టాక్సీ జామ్మని రాకెట్టులా దూసుకుపోయిందట. పోలీసులు శతవిధాల ప్రయత్నించినా లాభంలేక పోయిందట. ఎవరైనా వారి ఆచూకి తెలిపితే అట్టివారికి అయిదువేలు బహుమతివ్వబడునని ప్రభుత్వం ప్రకటించిందట—ప్రె...

(48 వ పేజీ చూడండి)




ఆక్సర్స్ లాడ్జిలో రవీంద్ర వుంటున్న రూమ్ రోడ్డుమీద నుంచి కొట్టవచ్చి న్టు కనిపిస్తోంది.

రీటాసుఖాడియా అద్దెకారులోంచి దిగి త్వరగా మెట్ల వైపు నడిచింది. హైహీల్స్ని లయబద్ధంగా చప్పుడు చేయిస్తూ.

కన్ను చెదిరించే అందం వుంది రీటాకి. మంచి వయసులో కూడా వుంది.

అందులో వుంటున్న విద్యార్థులకి మతి పోతోంది ఆమెను చూస్తుంటే, ఆమె అలా ధైర్యంగా లోపలికి వస్తుంటే.

"రవీంద్రగోపాల్ ఎక్కడుంటారు ?" నాజూకుగా, తియ్యగా ప్రశ్నించింది ఆంగ్లంలో ఎదురుగా కనిపించిన, అడ్డపాపిడి తీసిన కుర్రవాణ్ణి.

"యిదేనండి అతని గది."

"తాళం వేసి వుందే."

"ఎక్కడికైనా వెళ్ళాడేమో - ప్రక్కగదిలో అడగండి."

ప్రక్కగది తలుపు మీద సుతారంగా శబ్దం చేసింది.

తలుపు తెరచుకుంది.

ఎర్రబడ్డ కళ్ళతో, పెరిగిపోయిన హిప్పీ జుట్టుతో ఒక అవతారం బయటకువచ్చింది.

గుప్పున వాసన వచ్చింది అతని దగ్గర నుంచి. అది యింటిమేట్ సెంటు వాసన కాదు. దర్బార్ అగర్బత్తి వాసన అంతకంటే కాదు... నాటుసారా కంపు.

రీటా ముక్కు మూసుకుంది.

ఆమె అడిగిన ప్రశ్నకి పకపకా నవ్వుతూ "రవీంద్రగోపాల్గాడా... ఈపాటికంటా వాడు చూశాడంటే రమీముని గుండె ఆగి చచ్చి పోతాడుకాని... నాగదిలోకి వచ్చి కూర్చో హాయిగా కబుర్లాడుకుందాం..." అన్నాడు మత్తుగా.

'దయచేసి అతను ఎక్కడికి వెళ్ళాడో చెప్పండి...' తిరిగి యింగ్లీషులోనే అడిగింది.

'వాడితో నీకేంపని... రమ్మన్నాడా... ఎంత యిచ్చాడు... అంతకంటే ఎక్కువే యిస్తాను కాని నాలో వుండకూడదూ...'

'షటప్...'

'తప్పాదియ్యా... నీకు కూడా వచ్చున్న మాట ఆ మాట...'

రీటా గిరుక్కున వెనక్కు తిరిగింది.

'ఆగు...ఆగు- నిన్ను ఎక్కడో చూసి నట్లు గుర్తు...' అన్నాడు జుట్టుపీక్కుంటూ

తల ప్రక్కకు త్రిప్పి 'హోటల్ సన్ ఫ్యాలో ...' అంది చిరాకుగా.

'ఓ మీరా... అయామ్ సారీ... ఎవరో అనుకున్నాను. రండి రండి... రవీంద్రగోపాల్ యిప్పుడే బయటకు వెళ్ళాడు. వాడు వచ్చేంత వరకూ నా రూమ్లో రెస్టు తీసుకోండి...' అన్నాను వినయంగా.

ముందు సందేహించిందికాని చేసేదిలేక ఆహ్వానం అంగీకరించింది.

లోపలికి రానిచ్చి, తలుపు దగ్గరికి వేసి, ఆమె చేయి పట్టుకుని దగ్గరకు లాక్కున్నాడు.

ఆమె కెవ్వున అరచింది. అతడు భయ పడలేదు. పట్టు మరింత బిగించాడు. ఆమె పెనుగులాడింది.

అంతలో తలుపు తెరుచుకుంది భళ్ళుమని.

ఒక బరువైన చేయి అతడ్ని దూరంగా తోసింది.

'ఆర్ యు నాట్ ఎషేమ్డ్ ఆఫ్ యిట్ ...' ఆ కంఠం ఖంగున మ్రోగింది.

'ఓహో...హీరో రవీంద్రగోపాల్గారా... రండిసార్ రండి... యిది మీ కోసే సార్... తీసుకువెళ్ళండి. ఎంత యిచ్చారో ఏమిటో పాపం.' ఆ త్రాగుబోతు విద్యార్థి హేళన చేశాడు.

రవీంద్ర సమాధానం చెప్పకుండా బయటకు వచ్చాడు. ఆమె అతడ్ని అనుసరించింది. రవీంద్ర తన గది తాళం తీస్తుంటే- దగ్గరికి వచ్చి-

'హైదిహై...మీరేనా రవీంద్ర గోపాల్ అంటే' అంది వికసించిన ముఖంతో.

'అవును నేనే. ఏం కావాలి మీకు...'

'నేను అసలు మీ కోసమే వచ్చింది

యింతలో ఈ రాక్షసుడి చేతిలో చిక్కుకున్నాను.'

'నాతో మీకేం పని' ఆమె వైపు ఎగాదిగా చూశాడు.

'నువ్వు తొందరగా కానిచ్చి నా రూమ్‌కి పంపు' (పక్క గది విద్యార్థి వాగుతున్నాడు గుమ్మం దగ్గరకి వచ్చి).

'మీరేమీ అనుకోకపోతే మీ రూమ్‌లోకి వెళ్ళి మాట్లాడుకుందాం. మీ హాస్టలు కుర్రవాళ్ళకి కొంచెం కూడా మంచీ మర్యాదా లేదనుకుంటానే' అంది జవాబు యిచ్చేలోగా గదిలోకి జొరబడింది.

ఆశ్చర్యపోతూ లోపలికి వచ్చి తలుపు జారవేశాడు.

'ఏమీ అనుకోకండి వాడికి ఈ మధ్య చిన్న షాక్ లాంటిది తగిలింది. దానితో అలా ప్రేలాగటం మొదలు పెట్టాడు.'

'కొంపతీసి లవ్ షాక్ కాదు కదా' కిలకిలా నవ్వింది.

'సుమారు అలాంటిదే.'

'నేను కూర్చోవచ్చా,'

'ష్యూర్.'

'మీ రూమ్ చాలా అందంగా ఉంది. మీరు కూడా' మళ్ళీ నవ్వింది. రవీంద్ర ఉలిక్కిపడ్డాడు.

'క్షమించాలి, యిదివరకు మిమ్మల్నెప్పుడూ చూడలేదు' అన్నాడు.

'నేను కూడా మిమ్మల్ని చూడలేదుకదా.'

'మరి ఎందుకు వచ్చినట్లు ఎవరికోసం వచ్చినట్లు ?'

'మీకోసమే. కాని ఎందుకు వచ్చాను అన్నది మీకు అప్పుడే అర్థంకాదు' చిలిపిగా చూసింది.

'మీ పేరేమిటో తెలుసుకోవచ్చా.'

'రీటా. మిస్ రీటా సుఖాడియా.'

రవీంద్ర మాట్లాడలేదు.

'అవును. నన్ను చూస్తుంటే మీకు ఏమేమో అనిపించడం లేదూ?'

'లేదు. అది సరేకాని నా గురించి వివరాలన్నీ మీకెలా తెలుసు.' అని అడిగాడు చిరాకుగా.

'మీ గురించి మీకు తెలియని విషయాలు కూడా కొన్ని నాకు తెలుసు.'

'అబ్బా. ఏమిటో అవి.'

'యిలా రండి చెప్తాను.'

'వాట్.'

'ఏమీ ఫరవాలేదు. దగ్గరికి రండి' ఆమె ఒయ్యారం ఒలకబోసింది.

రవీంద్రకి చాలా యిబ్బంది కలిగింది. ఎంతకీ అతను దగ్గరకు రాకపోటంతో ఆమే లేచి అతని దగ్గరకి వచ్చి భుజాల చుట్టూ చేతులు వేసి 'కమ్మాన్ కిస్ మీ' అంది.

'ఛీ.' అంటూ చీదరించుకుని దూరంగా జరిగి 'మీరు యిలా అసభ్యంగా ప్రవర్తిస్తే యిప్పుడే ఈ క్షణమే మిమ్మల్ని బయటకు గెంటాల్సి వస్తుంది. మైండ్ దట్' అన్నాడు కోపంగా.

'అందమైన ఆడది కోరి దగ్గరకి వస్తే అలా అసహ్యించుకోకూడదు. అనుభవించటం నేర్చుకోవాలి మిస్టర్' మళ్ళీ దగ్గరికి వచ్చి అతనిమీద వాలిపోయింది.

రవీంద్ర కోపాన్ని అదుపులో పెట్టుకోలేకపోయాడు. సాచి కొట్టాడు చెంపమీద.

జీ వి తం

పల్లవదశను దాటి
పరిమళ లహరిని మీటి
పసరుకాలాన్ని
కసరు కాలాన్ని
పరిక్రమించి
రస సమన్వితమై
చేదుకు నిరసన
తెలుపడమే—జీవితం.

—జి రామశేషయ్య

రీటా చెంప తడుముకుంటూ 'కోపం పోయిందా' అనడిగింది. ఆమె కళ్ళల్లో గిర్రున నీరు తిరిగింది.

'అయామ్ సారీ. మీమీద చేయి చేసుకోవాల్సి వచ్చినందుకు చాలా బాధపడుతున్నాను'

'దట్సాల్ రైట్. మీరు చాలా మంచి పని చేశారు.'

ఆమె కళ్ళు తుడుచుకుని, కళ్ళద్దాలు పెట్టుకుని, వేనిటీ బేగ్ చేతిలోకి తీసుకుంది.

'మీకేమీ అభ్యంతరం లేకపోతే నాతో బీచ్‌కి వస్తారా' అంది.

'యిదో కొత్త నాటకమా.'

'కాదు. అసలు నాటకం ఏమిటో చెప్పటానికి.'

'అదేదో యిక్కడే చెప్పవచ్చునుగా'

'మీరు యింకాస్త ఆలస్యం చేశారంటే మీతోటి విద్యార్థులు వచ్చి తలుపులు బద్దలు కొడ్తారు. జాగ్రత్త.'

రవీంద్రకి ముచ్చెమటలు పోశాయి.

'నడవండి.' అన్నాడు త్వరత్వరగా తయారవుతూ.

తలుపు తియ్యగానే– ఎదురుగా అరడజను మంది విద్యార్థులు, ఛలోక్తులు విసరుతూ ప్రక్కకి తప్పుకున్నారు.

'వాళ్ళతో మనకేంపని. రండి పోదాం.' చనువుగా అతని చేయి పట్టుకుంది రీటా.

* * *

మర్నాటికి రవీంద్ర, రీటాల విషయం పెద్ద కథగా తయారయ్యి బయటకు వచ్చింది. అది కాస్తా రజని చెవిని పడింది.

జరిగినదానికి ఎంతో ఆనందంగా వున్నా, ఆ రోజు రజని చూసిన చూపుకీ, ముఖం త్రిప్పుకుని వెళ్ళిపోయిన తీరుకీ విలవిలలాడిపోయాడు రవీంద్ర ఎంతగానో.

రజని యూనివర్శిటీనుంచి యింటికి వెళ్ళే టైమ్‌కి ఔట్ గేట్ దగ్గర మకాంవేశాడు. అందమైన రజని అదోకలా ముఖం పెట్టుకుని వచ్చింది. అదృష్టవశాత్తు ఒంటరిగా అతడ్ని చూసి చీదరించుకుంది. అయినా బాధపడకుండా దగ్గరకి వెళ్ళాడు.

'మీతో ఒక ముఖ్య విషయం చెప్పాలి.'

'అదేమిటో నేను విన్నాను. మీరేమీ ప్రత్యేకంగా చెప్పక్కర్లేదు .అసలు మీరింతగా దిగజారిపోతారనినేను కలలో కూడా అనుకోలేదు.'

''ప్లీజ్ నేను చెప్పేది సరిగ్గా వినండి..''

''మీరు నాకేమీ చెప్పక్కర్లేదు.. దయచేసి యిక్కడ నుంచి వెళ్ళిపోండి''

''నామాట వినండి.''

''నేనేమీ వినదలుచుకోలేదు.. ప్లీజ్ గెట్ అవుట్''

ఆమె అసహ్యించు కుంది. అది భరించలేకపోయాడు.

ఆ రాత్రంతా ఎంతో విలపించాడు. రవీంద్రలో వున్నగొప్పతనం ఏమిటంటే బాధల్లో వున్నప్పుడే అతని మస్తిష్కంలో మంచి ఆలోచనలు మెరుపులై మెరుస్తుంటాయి.యిప్పుడు కూడా ఒకమెరుపు మెరిసింది అతని మెదడులో ఆ మెరుపు శరవేగమై రజనిని చేరుకుంది రెండు రోజుల్లో

కాని రవీంద్ర ఆశించినట్లు రజని పరుగున వచ్చి 'నన్ను క్షమించరూ' అంటూ అతని చేతుల్లో వాలిపోలేదు. చేతిలో వాలిపో

"ఫోటో" కథ చాలా బాగున్నది. మనస్సును కదిలించి వేస్తున్నది. ముగింపు విధియెంత బలీయమో తెల్పుతున్నది. వింత సాధారణ కోరికైనా, అవకాశాలు జతపడి వచ్చినట్లే యేర్పడి, కుదరకపోవడం చాలా దారుణం. ఇలాంటివి నిత్యజీవితంలో వింతవారికైనా తటస్థపడేవే.

"సముద్రం" గూడా చెప్పుకో దగ్గంత బాగానేవుంది. చిన్ననాటి స్మృతులు చెరిగిపోవు. పెద్దయ్యేకొద్దీ బలీయ మౌతాయి. సాంఘిక కట్టుబాట్ల మధ్య అవి గుంభనగా జీవిస్తూ కేవలం స్మృతివల్ల, అనుకూల ఊహలవల్ల తృప్తిపడుతూ వుంటాయి. మంచి మనస్తత్వ చిత్రణ యీ కథ.

"ఇంకో సరిత కథ" షుమారుగా వున్నది. మూగతనంలేని మూగతనం వెనక వింత అనురాగమూ, వేదనా యిమిడి వుంటాయో వివరించ బడింది. సెంటిమెంట్సు మీద ఆధారపడి మెత్తని యెగుడు దిగుడులతో సాగిన నోరుగల మూగకథ.

## 1976 దీపావళి

"హెడ్ వెంకటస్వామి" కథ సాదా రచన. ఫరవాలేదు. విధ్యుక్త ధర్మం నిర్వహించినందుకే ప్రమోషను వస్తుందనుకోవడం యీనాటి వుద్యోగుల అత్యాశ. అందుకు వచ్చిన చిన్న బహుమతే గొప్ప. దానికి అసంతృప్తి పడటం వెంకటస్వామి వంటివారి బలహీనత.

---

టానికి వాళ్ళ ప్రేమ అంతవరకూ రాలేదుమరి.

ఏదో రవీంద్రగోపాల్ ఒకరోజున యూనివర్సిటీ కేంపస్‌లో రజనిని చూడటం—ఆమె అందానికి ముచ్చటపడి ఒకశుభముహూర్తాన చిన్నప్రేమలేఖ వ్రాయటం. అది ప్రిన్సిపాల్ దాకా వెళ్ళటం. ఆ తరువాత చిన్నారి రజని మనసుకూడా మారటం జరిగింది.

అంత వరకూ రవీంద్ర ఆమె స్పర్శకికూడా నోచు కోలేదు పాపం.

ఆ తరువాత ఎన్నోసార్లు పెళ్ళి గురించి ఆమె నిర్ణయం తెలియజేయమని బ్రతిమలాడాడు.

'మాయింట్లో వాళ్ళువప్పుకుంటే నాకేమీ అభ్యంతరంలేదు' అని ఆమె తప్పించుకుంటూ వస్తోంది. విసుగు చెందని విక్రమార్కుడిలా ప్రేమించటం వలన వుత్పన్నమవుతున్న అగ్నిపరీక్షల్ని నేర్పుగా ఎదుర్కొంటూ వస్తున్నాడు రవీంద్ర.

వారం రోజుల తరువాత-లైబ్రరీలాన్‌లో

'మీకు నా మీద యింకా కోపం తగ్గినట్లు లేదు-'అన్నాడు పలకరిస్తూ.

'కోపం ఎందుకు.' ఈసడించుకుంది

'అయితే నావుత్తరం అందిందా మీకు.'

'ఊ'

'అసలు విషయం తెలుసు కున్నారనుకుంటాను.'

'ఉ... తెలుసుకున్నాను... మీరు ప్రేమకంటే ఎక్కువగా ఆశించేది వేరే యింకొకటి వున్నదని.'

'ఏమిటది.'

'కట్నం కానుకలు తెచ్చే కోటీశ్వరుడి కూతురు.'

'పొరపడుతున్నారు నాకు అలాంటి వుద్దేశం ఎప్పుడూ లేదు. లేనిపోనివన్నీ చెప్పి మీ మనసు మార్చటానికి ఎవరో ప్రయత్నిస్తున్నారు.' అన్నాడు ఆవేశంగా.

'లేదు. ఒకవిధంగా నన్ను కాపాడుతున్నారు. నన్ను విసిగించక వెళ్ళండి. ప్లీజ్ యింకెప్పుడూ నా జోలికి రావద్దు.'

రవీంద్ర తేరుకునే లోపల ఆమె వెళ్లిపోయింది విసవిసా.

* * *

మర్నాడు రవీంద్ర రూమ్‌కి ఖద్దరు బట్టలు ధరించిన బ్రహ్మరమీసాల భారీ విగ్రహం ఒకటి వచ్చింది పొయ్యి గొట్టంలాంటి చుట్ట నోట్లో పెట్టుకుని —

'అబ్బాయ్ నీ పేరేనా రవీంద్రగోపాల్ అంటే' అంటూ. సాదరంగా ఆహ్వానించాడు రవీంద్ర.

'నీకు అమ్మాయిని యివ్వటానికొచ్చాం... మీ అమ్మా నాన్నా నీ యడ్రస్ యిచ్చి చూసుకుని రమ్మన్నారు. మరి నువ్వేమంటావ్' అన్నాడు ఆ పెద్ద మనిషి.

'మా యింటికి వెళ్లారా మీరు.'

రజని తనని అనుమానించటానికి కారణం యిప్పుడిప్పుడే అర్థం అవుతోంది రవీంద్రకి. అయితే విషయాలన్నీ తనకంటే ముందుగా ఆమెకెలా తెలిసాయి అన్నది అంతుపట్టటం లేదు.

'ఆ మీ నాన్నా నేనూ చిన్ననాటి స్నేహితులం. ఒకే స్కూలులో కలిసి చదువుకున్నాం మరి అయిదో క్లాసుదాకా.'

'అదా సంగతి. అయితే మా నాన్నగారు ఏమన్నారు.'

'కట్నం రూపేణ రెండు లక్షలదాకా యిస్తాను.'

"అని మీరు అనటంతో. వెంటనే మా నాన్నగారు 'గెట్ అవుట్'అనాలే."

'అబ్బే ఎందుకుంటాడు... అనలేదు. డబ్బంటె ఎవరికి చేదు చెప్పు చూడబ్బాయ్.

## మరపురాని

నువ్వు వూరిని ఎంత వుద్ధరిద్దామనుకున్నా వరకట్నం తీసుకోమని వేదికలు ఎక్కి వుపన్యాసాలు యిచ్చే మీ బ్రహ్మచారుల సంఘానికి ఎంత అధ్యక్షుడవైనా ..కార్యదర్శివైనా.. యిచ్చుకోటం పుచ్చుకోటం వచ్చేసరికి వుంది చూశావు మీ నాన్నదగ్గర కుక్కపిల్లవే ఏంటనుకున్నావో ఏమిటో" రవీంద్రకి వాదించే ఓపిక లేకపోయింది.

'మా నాన్నగారు వప్పుకున్నట్లేనా.'

'రెండు లక్షల రెడీకేషూ ఆరెకరాలు ఒకటోరకం మాగాణీ యిస్తాను అన్నానంతే. మీ అమ్మా నాన్నా ముఖాలు తేలేశారు. అంతకంటే ఏంచేస్తారు మరి కోడలే లక్ష్మీదేవై వస్తుంటేను.'

'యింకేమన్నారు మా అ...మ్మ...నాన్న'

ఆ పెద్దమనిషికి తెలీదు రవీంద్రకి తల్లి లేదని.

'అబ్బాయిని చూసుకొనిరండి. మీకు నచ్చితే ఈ సంబంధం ఖాయం అన్నారు. ఎందుకైనా మంచిదని.'

'నన్ను అడగటానికి వచ్చారు. అంతేనా.'

'నీ వుద్దేశంకూడా తెలుసుకోవాలి కదటయ్యా. నువ్వేం నిర్ణయించుకున్నావో చెప్పు.'

'ముందు మర్యాదగా లేవండి చెప్తాను.'

'ఆ... ఏమిటీ జబర్దస్తీ.'

'చూడండి మీరు ఎక్కడ్నుంచి వచ్చారు. ఎవరు పంపించగా వచ్చారు. అన్నీ సరిగ్గా చెప్పేరా సరాసరి. లేకపోతే ఈ ప్రక్కగదిలోకి పంపించాల్సి వస్తుంది. అందులో ఒక త్రాగుబోతు విద్యార్థి వున్నాడు. మిగతా విషయాలన్నీ వాడే చూసుకుంటాడు."

'బాబ్బాబు నీకు పుణ్యం వుంటుందికాని ఆ పని మాత్రం చెయ్యకు. అంతా చెప్తాను

## కథలు

''గొడుగు' కథ నాకు నచ్చలేదు. బడిపంతులికి చినుగుల కుట్ల గొడుగు ప్రతీక అని చెప్పబడింది. అతని కొడుకు బి. ఏ. చదివి వుద్యోగం దొరక్క దానికి వారసుడవుతాడు. ట్యూషన్లు చెప్పడానికి పూనుకొని. అతనికి ఉద్యోగాపేక్షకంటె నాటకాలాడి బహుమతీ పొంది సినిమాల్లో చేరాలని ఉబలాట జాస్తి: బడిబంతులకి గొడుగుకి; కొడుక్కి, ఒక చెల్లెలికి పరస్పరం సాను భూతిలేని, సంబంధంతో అతుకుల బొంతగా వుంది యీ కథ.

మామూలు వారపత్రికల కథలే యివన్నీ. పోటీకి వచ్చినందువల్ల బహుమతులు పెద్ద మొత్తాలు పొందాయి. అప్పుడప్పుడు వచ్చే కథల్లో వీటికంటె మేలైనవి కొన్ని లేకపోలేదు.

మంచి సంఘటన, చక్కని మనస్తత్వ చిత్రణ; ప్రత్యేక శిల్ప చాతురి పోటీ కథల్లో గూడా లోపించడం బాధాకరమే. రచయితలు పెరక్కపోతే, సంఖ్యలో గాదు, గుణంలో; పాఠకుల్ని పెంచలేరు. ఇప్పటికి యిట్లా యీ కథల్ని అభినందించడం కంటె చెయ్యగలిగింది లేదు గద ?

**- మిరియాల ప్రమీలారావు**

రాజమండ్రి

## ప్రేమ కథ

కూర్చో.' జరిగిందంతా వివరంగా చెప్పారు ఆ నాటకంలో మరో పాత్రధారి శేషాచలం.

* * *

మర్నాడు రవీంద్రని కలుసుకుని పలుకరించింది రజని— 'బాగున్నారా' అంటూ.

చిన్నగా నవ్వి ముందుకు వెళ్ళబోయాడు.

'మిమ్మల్నే పిలుస్తుంది. మీతో కొంచెం మాట్లాడాలి. అలా కేంటిన్‌కి వస్తారా' అంది దగ్గరకి వస్తూ.

'క్షమించండి. నాకు వేరే పని వుంది.'

'నా మీద చాలా కోపంగా వుంది కదూ మీకు.'

'మీ మీద అభిమానం పెంచుకోటానికీ, ఆగ్రహం తెచ్చుకోటానికీ నే నేమీ కాదు కదా మీకు.'

'ఆ మాట మనస్ఫూర్తిగా అంటున్నారా'

'ఒకోసారి మన నీడని చూసి మనమే జడుసుకుంటుంటాం.'

'నేను చెప్పుతున్నది వేదాంతం కాదు.'

'నేను చెప్తుంది మీకు వేదాంతం అనిపిస్తే మీరు చాలా ఉన్నత స్థానంలో వున్నారన్న మాట. అక్కడికి నేను చేరుకోడం అన్నది జరిగే పని కాదు.'

'ఎందుకు నన్నిలా మాటల్తో విసిగిస్తారు'

'మీకు బాధ కలిగిస్తే క్షమించండి. యింకెప్పుడూ అలా మాట్లాడను.'

రవీంద్ర ముందుకు వెళ్ళిపోతున్నాడు.

'వెళ్ళిపోతున్నారా. అంతేనా.'

'దారులు వేరయినప్పుడు ఎవరి దారిలో వారు వెళ్ళటమే మంచిది.'

'మీ వెనుక నేను వచ్చేస్తే ఏం చేస్తారు'

'మీది నా దారి కాదని చెప్తాను.'

'అయినా మీతోనే వస్తానంటె.'

'నాకు ఆ దారి ప్రక్కనే ఒక సమాధి కట్టి వెళ్ళమంటాను.'

రజని మనసు కలత పడింది. మనసు విషాద గీతిక పాడింది. ఆ అందాల రాశి కళ్ళల్లో కన్నీళ్ళు నాట్యం చేశాయి లయబద్ధంగా.

* * *

రజని యిష్టా యిష్టాలతో ప్రమేయం లేకుండా ఆమె పెళ్ళి కుదిరింది. అన్నగారు కిషోర్ వెంటనే అన్ని ఏర్పాట్లు చేయించాడు. నిశ్చయ తాంబూలాలు తీసుకోటానికి.

వెక్కి వెక్కి ఏడ్చింది.

అంతా తెలిసిన మేనమామ శేషాచలంగారు తల నిమిరి 'వూరుకో తల్లీ. ఏం చేస్తాం. అలా రాసిపెట్టి వుందంతే' అనటం కంటే వేరే ఏమీ చేయలేదు.

రజని మాత్రం మనసు కట్టి మూల పడవేయలేక పోయింది.

* * *

రాత్రి ఎనిమిది గంట లయ్యింది.

రవీంద్ర చక్కని చిత్రం గీస్తూ కూర్చున్నాడు తన గదిలో.

తలుపు చప్పుడయ్యింది లేచి వెళ్ళాడు.

తలుపు తెరవగానే రజని ఆయాసపడ్తూ లోపలికి వచ్చింది.

నోరు తెరిచి, ఆశ్చర్యంగా చూస్తూ వుండి పోయాడు రవీంద్ర మూగవాడిలా.

తలుపు వేసి గడియ బిగించింది.

'యింత రాత్రివేళ ఏమిటి యిలా వచ్చిందని ఆశ్చర్య పడుతున్నారా. నేను యిలాంటి పని చేస్తానని మీరు ఎప్పుడూ అనుకోలేదు కదూ.'

'అది కాదండీ.'

'ప్లీజ్ నన్ను చెప్పనివ్వండి. ఈ రజని ఒక ఆటబొమ్మ దానికి మనసు లేదు. ప్రేమ అంటే ఏమిటో తెలీదు. ఒక బండరాయి పాషాణం అనుకున్నారు కదూ. లేదు రవీ నాకూ మనసుంది. అందరిలాగే ఆ మనసు నిండా ప్రేమా, మమతా వున్నాయి. అందుకే ఒకదాని కోసం ఒకటి త్రెంచుకోలేక యిన్నాళ్ళూ సతమతమయ్యాను. కాని ఈ రోజు ఒక నిర్ణయానికి రాక తప్పలేదు. అందుకే ఈ పని చేశాను. యిప్పుడు చెప్పండి. నన్ను పెళ్ళిచేసుకుంటారా.'

రవికి అంతా అయోమయంగా కనిపించింది.

'మీరు ఆవేశపడుతున్నారు. అలా కూర్చోండి చెప్తాను' అన్నాడు.

'అనవసరంగా కాలయాపన చేయకండి రవీ... మిమ్మల్ని ప్రార్థిస్తున్నాను చెప్పండి. నన్ను పెళ్ళి చేసుకుంటారా లేదా.'

'ంత అదృష్టం నాకు వుందంటారా.'

'యిదిగో మీముందు వుంచుతున్నాను. యిందులో ఏది నాకు వరంగా యివ్వదలిచారో మీరే నిర్ణయించండి.'

ఒక చేతిలో పసుపుకొమ్ము కట్టివున్న త్రాడు, రెండో చేతిలో ఎండ్రిన్ సీసా వున్నాయి. ఆ క్షణం రజని ఒక చిన్నపాపలా, ఎంతో అమాయకురాలిలా కనిపించింది.

'ఏమిటిది.'

'నా జీవితానికి వెలుగు చీకటీ.'

'వీటి పర్యవసానం ఏమిటో ఆలోచించారా'

'ఒకటి మిమ్మల్ని నాతో కలుపుతుంది. రెండోది శాశ్వతంగా విడదీస్తుంది.'

'మొదటిది మనల్ని కలిపినా అది మీ అన్నయ్య తలచుకుంటే పురిత్రాడు గా మారుతుంది.'

'అయినా భయంలేదు. మీ భార్యగా చనిపోవటం నాకు ఆనందమే.'

'మీ అన్నయ్య మిమ్మల్ని చావనివ్వరు.

# మరపురాని ప్రేమకథ

ఆయనకి వున్న పగంతా నామీద.'

'మిమ్మల్ని ఎలా కాపాడుకోవాలో నాకు తెలుసు.'

'వద్దు వద్దు నాకోసం కష్టాలు కొని తెచ్చుకోకండి. ప్లీజ్ యింటికి వెళ్లండి'

'యిదేనా మీ నిర్ణయం.'

రవీంద్ర జవాబు యివ్వలేదు.

'ఆడదాన్ని మీరు అర్థంచేసుకుంది యిదే నన్నమాట. సరే మీరు చెప్పినట్లే చేస్తాను రవీ. కాని ఒకటి గుర్తుంచుకోండి. ఆడది ఏదైనా మర్చిపోతుందికాని మనసిచ్చి మర్చిపోలేదు.'

గిరుక్కున వెనక్కుతిరిగింది రజని. కాని తలుపు తెరుచుకోలేదు.

రవీంద్ర అడ్డంగా నిలబడి ఆమె చేతిలోని వస్తువులు తీసుకుని ఒకటి దూరంగా విసిరి, రెండోది గుప్పిట్లో బిగించాడు.

రజని ఆనందానికి అంతులేదు. మరు క్షణం అతని కౌగిటిలో ఒదిగిపోయింది.

గుండెలకు హత్తుకున్నాడు తృప్తిగా, ప్రేమగా. యిద్దరి కళ్లల్లో ఆనందభాష్పాలు కట్టలు తెంచుకుని గంతులు వేస్తున్నాయి.

తలుపు చప్పుడయ్యింది. వులిక్కిపడి యిద్దరూ దూరంగా జరిగారు.

రజని భయపడింది. రవీంద్ర ధైర్యం చెప్పి తలుపు తెరిచాడు.

ఎదురుగా శేషాచలంగారు నవ్వుతూ నిలబడ్డారు.

'మీరా...' అన్నాడు రవీంద్ర ఆశ్చర్యంగా.

'అవును బాబూ నేనే మిమ్మల్ని యిద్దరినీ ఆశీర్వదించటానికి వచ్చాను.'

'పోన్లే మావయ్యా నీకైనా మా మీద దయకలిగింది అదే చాలు.'

'ఇప్పుడు నా మేనకోడలివి అనిపించు కున్నావు తల్లీ ... నాకు నచ్చిన పని చేశారు మీ యిద్దరూ. ఏదీ ఒకసారి మీ యిద్దరూ దగ్గిరదగ్గిర నిలబడండి. చూస్తానుమనసారా'

యిద్దరూ దగ్గరకి వచ్చి ఆయనకి నమస్కరించారు.

'అక్షంతలు పట్టుకుని మేం కూడా సిద్ధంగా వున్నాం మరి.'

ఆ మాటలకి వులిక్కిపడి తల త్రిప్పి చూశారు. ముగ్గురూ ఎదురుగా గుమ్మం దగ్గర కిషోర్ అతని భార్య వనజ నిలబడి వున్నారు నవ్వు ముఖాలతో.

'అన్నయ్యా...వదినా... మీరా... ఎందుకొచ్చారు' అంది ఆవేశంగా.

'ఎందుకు రజనీ అంత కంగారుపడ్తావ్' అంది వనజ దగ్గరకి వస్తూ.

రవీంద్రకి అంతా ఆశ్చర్యంగా వుంది.

'రజనీ. నా మీద చాలా కోపంగా వుంది కదూ నీకు' దగ్గరకి వచ్చి ఆప్యాయంగా చెల్లెలి తల నిమిరాడు కిషోర్.

రజని కళ్ళు వర్షించాయి.

'అసలు జరిగిందేమిటంటే'

'చాలెండి. ఇప్పుడవన్నీ ఎందుకు' మందలించింది వనజ.

'అలా కాదమ్మా. జరిగిందంతా చెప్పటమే మంచిది. లేకపోతే మీ మీద శాశ్వతంగా చెడ్డ అభిప్రాయం వుండిపోతుంది వాళ్ళిద్దరికీ.' అన్నారు శేషాచలంగారు.

'ఏం జరిగిందో చెప్పన్నయ్యా'

'నువ్వు మొదట్లో రవీంద్రగారి విషయం చెప్తూ... ఒకబ్బాయి నన్ను పెళ్లి చేసుకుంటా నంటున్నాడు. నాకూ యిష్టమే. మీరే ఈ పెళ్లి నిశ్చయించండి అన్నావు గుర్తుందా.'

'ఊ...'

'ఆ రాత్రే అమ్మకీ నాన్నకీ వుత్తరం వ్రాశాను, జరిగిందంతా తెలియజేస్తూ నేను ఆ అబ్బాయిని దూరం నుంచి చూశాననీ నాకు నచ్చాడనీ ఈ సంబంధం అన్ని విధాలా బాగుందనీ వ్రాశాను. ఆ వుత్తరం చదువుతూ మీ వదిన చిన్న జోక్ చేసింది. ఏమనంటే పేమ పెళ్ళిళ్లు అన్నీ ఒక్కసారి మితాయి పెళ్ళిళ్లట. ఎందుకంటే మేం యిద్దరం ప్రేమించి పెళ్లి చేసుకోలేదుకదా. ఏదో అత్త కూతురు, వరస రాబట్టి మా పెళ్లి జరిగిపోయిదంతే-మా యిష్టా యిష్టాలతో ప్రమేయం లేకుండా'

'ఆ సైన నేనంటే యిష్టం లేనట్టు'

'మధ్యలో మీ యిద్దరూ తగవులాడుకోకుండు అసలు సంగతి చెప్పండి' శేషాచలంగారు కలుగజేసుకున్నారు.

'ఆడదాని ప్రేమ గొప్పనా. మగాడి ప్రేమ గొప్పదా అని మా యిద్దరికీ మాటా మాటా వచ్చింది. మగాడు అందానికీ, అయిశ్వర్యానికీ లొంగిపోతాడని మీ వదినా. ఆడది చెప్పుడు మాటలు విని మోసపోతుందని నేనూ పందెం వేసుకున్నాం. పర్యవసానమే మీ కిన్ని బాధలు.

## అంతా సత్యమనే అనుకోవాలి

ఏది సత్యం ? ఏది మిథ్య ? అనే ప్రశ్న వచ్చినప్పుడు వేదాంతులు 'బ్రహ్మ సత్యం, జగన్మిథ్య' అని చెప్పడం మనకు తెలుసును. మనకు కనబడుతూ ఉన్న యీ ప్రపంచమంతా భగవంతుని మాయావిలాసమే కాని యధార్థమైనది కాదనీ, పరబ్రహ్మ ఒక్కటి మాత్రమే సత్యమనీ దీని అభిప్రాయం. ఈ అభిప్రాయమే మన మనస్సులలో నాటుకొని ఉండడంవల్ల ప్రతివిషయాన్నీ నిర్లక్ష్యం చెయ్యడం జరుగుతున్నది. ఏదో ఒకవిధంగా కాలంగడిచిపోతే చాలు అని అనిపిస్తుంది. ఇలా ఉండబట్టే జీవితంమీద కూడా నిర్లక్ష్యభావం కలుగుతూ ఉంటుంది. దానివల్ల ఆరోగ్యం దెబ్బతింటుంది. ఏ పనిమీదా ఆసక్తి వుండదు.

'బ్రహ్మ సత్యం,జగన్మిథ్య'అని చెప్పినవారి ఆశయాన్ని మనం సరిగా అర్థం చేసుకోనందున ఇలాటి అనర్థాలు కలుగుతాయి. వారి అభిప్రాయం ఏమిటంటే–శాశ్వతంకాని శరీరం పైని ఎక్కువఆస్థ ఉంచుకోకూడదని. ఆలా తనపైనే తనకు ఎక్కువ ఆపేక్ష వుంటే

## ధర్మపథం

ఇతరులకు సహాయం చెయ్యాలనే బుద్ధి పుట్టదు. ఈ విషయం మనస్సులో ఉంచుకొనే వారు ఆ విధంగా చెప్పారు. అంతేకాని – అన్నిటిపైనీ విరక్తిభావం ఉండాలని కాదు. విరక్తిభావం ఉంటే నిరసన భావమున్నూ కలుగుతుంది. అది మన ప్రాచీనులకు ఎంతమాత్రమూ ఇష్టం లేదు. రేపు మనం ఉంటామో ఉండమో అనే భావం కలిగితే యీనాడు మనం ఏ పనీ చెయ్యలేము. భవిష్యత్తులో అభివృద్ధి కలుగుతుందనీ, ధనం సంపాదించి సుఖపడతామనీ ఆలోచనలోనే విద్య నేర్చుకోవడం జరుగుతున్నది. విద్య సంపాదించేటప్పుడూ, ధనం సంపాదించేటప్పుడూ మనకు ముసలితనమూ, చావూ లేదని అనుకొనే వాటికోసం ప్రయత్నం చెయ్యాలని

'జరయు మృతియు లేని
జనునట్లు ప్రాజ్ఞుండు
ధనము విద్య గూర్చ దలపవలయు'

నీతివేత్తలు చెప్పి ఉన్నారు.

చావు లేదనుకొనే వీటికోసం ప్రయత్నం చేస్తున్నట్లు జగత్తు శాశ్వతం అనే భావంలోనే అభివృద్ధి కార్యక్రమాలకు పూనుకోవాలి. పెద్దలు చెప్పినది సరిగా అర్థం చేసుకోక ఉపేక్ష వహించడంవల్లనే మన దేశం విజ్ఞానంలో గాని, పరిశ్రమల్లో గాని ముందుకు రాలేకపోతున్నది. ఇతర దేశాలు విజ్ఞానంలో ముందుకు వచ్చాయి. వస్తున్నాయి. మనవారు బుద్ధిబలంలో తక్కువేమీ కారు. ఆ బలాన్ని మనం వినియోగించుకోలేక పోతున్నాము. అందువల్లనే ప్రతిభావంతులు స్వదేశాన్ని విడిచిపెట్టి యితర దేశాలకు పోతున్నారు. వారిమూలంగా ఆ దేశాలు బాగుపడుతున్నాయి. మన దేశం బాగుపడాలంటే జగత్తులోని పదార్థాలన్నీ సత్యాలనే, అనుకొని వాటికోసం సర్వవిధాలా యత్నించాలి. మన దేశంలోని ప్రతిభావంతుల బుద్ధిని దానికోసం ఉపయోగించుకోవాలి.

— బులుసు వేంకట రమణయ్య

---

అందుకు మీ యిద్దరూ మమ్మల్ని క్షమిస్తారని ఆశిస్తున్నాం.'

రవీంద్ర ఆనందంలో వుక్కిరి బిక్కిరి అయి సమాధానం చెప్పలేక పోయాడు.

'ఈ నాటకంలో కొంత వరకూ ముఖ్య పాత్ర మీ బావయ్యే పోషించాడు. అందువలన నాకు చాలా చెడ్డపేరు కూడా వచ్చింది రజనీ. నేనేదో మనుష్యుల్ని విడదీస్తాననీ, దేనికైనా వెనుకాడననీ. మీ వదినా, మావయ్యా కలిసి మీ యిద్దరినీ నమ్మించారు నిజానికి నేను ఏ పాపం ఎరగను చేసిందంతా మీ వదినా, మావయ్యేను.'

'అవునమ్మా రజనీ. మొదట్లో నేను కూడా మీ ప్రేమని తేలికగా తీసిపారేశాను. అందుకే అలాంటి చిన్న చిన్న పొరపాటు పనులు చేయించాల్సి వచ్చింది నీ మనసు మార్చటానికి. కాని రవీంద్ర యోగ్యుడు. అన్ని విధాలా నీకు తగినవాడు అని నేను కాస్త ఆలస్యంగా గుర్తించాను. ఏమైనా మీ యిద్దరికీ రాసిపెట్టి వుంది. కాబట్టి మేం ఏం చేసినా మీ యిద్దర్నీ విడదీయలేక పోయాం. చూడు బాబు. నువ్వు చాలా మంచి వాడివి. అందుచేత జరిగిందేమీ మనసులో పెట్టుకోకుండా అమ్మాయిని జాగ్రత్తగా చూసుకోవాలి. ఏమంటావ్' అన్నారు శేషాచలంగారు.

రవీంద్ర చిన్నగా నవ్వి వూరుకున్నాడు.

'మీ పెళ్ళి త్వరలోనే జరుగుతుంది వైభవంగా సరేనా.'

'అవునండి రవీంద్రా రేపే మీ నాన్నగారి దగ్గరకి వెళ్ళి అన్ని విషయాలూ మాట్లాడ్తాం. అంతవరకూ దయచేసి మా చెల్లెల్ని మాత్రం మా యింటికి పంపించండి మరి! అహ! ఇది మరో కొత్త నాటకం అనుకునేరు. కాదా లంటే కాగితంమీద రాసి యిస్తాను మా రజని మీ సొంతం అని.'

'నే నుండగా నీ కేమీ భయంలేదు రజనీ. మీ అన్నయ్య ఈ పెళ్ళి జరిపించకుండా ఎక్కడికీ వెళ్ళలేరు' అంది వనజ హామీ యిస్తూ.

'హాస్లే వదినా. యిప్పటికైనా మీఅందరికీ మా మీద దయ కలిగింది. అంతే చాలు' క్షణకాలం అందరిముఖాలూ గంభీరంగామారాయి.

''ఏమండీ శ్రీమతిగారు. ఇప్పటికైనా వప్పుకుంటారా. లైలా మజ్నూలు, రోమియో జూలియట్లు. ఆ సెంచరీస్‌లోనే కాదు. ఈ సెంచరీలో కూడా వున్నారని...'

కిషోర్ గలగల మాట్లాడ్తుంటే అందరి ముఖాలు వికసించాయి మళ్ళీ.

'ఛీ.వాళ్ళతో మా తమ్ముడిగారినీ మా మరదలు పిల్లనీ పోలుస్తారు ఏమిటండీ.వాళ్ళ కంటే మనవాళ్ళే గొప్పవాళ్ళు' అనుకున్నది సాధించారు.'

'అవును మరి ఒకచేతిలో పసుపుత్రాడు.ఒక్క చేతిలోఎండ్రిను సీసాను'

కిషోర్ తన మామూలు ధోరణిలో నవ్వించాడు.

రజని సిగ్గు పడింది.రవీంద్రకూడాను. పకపకా నవ్వారు అందరూ.

ప్రక్కగదిలోంచి తాగుబోతు విద్యార్థి కూడా వచ్చి శ్రుతి కలిపాడు–గుమ్మం దగ్గిర నిలబడి అసలు విషయం అర్థంకాకపోయినా-

''అలా నవ్వకండర్రా. వీళ్ళ యిద్దరిదే నిజంగా మరుపురాని ప్రేమకథే'

పాత రోజులు గుర్తుకు తెచ్చుకుంటున్న శేషాచలం గారు గంభీరంగా సెలవిచ్చారు

[ఇప్పటికీ ఆస్టర్స్ లాడ్జ్‌లోని ఆ గది అంటే అందరి విద్యార్థులకీ ఎంతోగౌరవం–అభిమానమూను. రజనీ రవీంద్ర గోపాల్‌ల ప్రేమ కథని పదేపదే చెప్పుకుంటూ-ఆ గదిని కళ్యాణ మండపం అనీ ప్రేమమందిరం అనీ, బృందావనం అని, 'విడిదియిల్లు' అనీ-యిలా రకరకాల పేర్లతో పిలుస్తుంటారు. ఆ గది దొరికిన విద్యార్థిని ఎంతగానో పొగుడ్తూ-త్వరలోనే రవీంద్ర గోపాల్ జాతకం పట్టబోతుందనీ, రజనిలాంటి సుగుణాలరాసి దొరకబోతుందనే అంటారు-కాని యిప్పటి వరకూ మళ్ళీ అలాంటి లక్కీ ఛాన్సు కొట్టిన విద్యార్థి మాత్రం ఎవ్వరు లేరు]

సీరియల్

# ఇన్ క్రెడిబుల్ గాడెస్

డాక్టర్ కేశవరెడ్డి



"కొంపలు ముంచే ముండాకొడుకు. మనం కోర్టుకొచ్చి సాచ్చి చెప్పలేదని మనమీద కంటు పెట్టుకున్నాడు" అంది నాగ.

రామచంద్రుడు దిగ్భ్రమకు లోనైయుండి ఆమె చెప్పినమాట గ్రహించలేదు. తేరుకున్నాక అతడు "సంవత్సరం నాళ్ళు కాపురముండిన ఇల్లు ఖాళీచెయ్యమనేదేంది? ఆయన పట్టా జేసిచ్చిన నేలేగదాయిది. ఇప్పుడసలు-"

నాగ అడ్డువచ్చి తను ఇందాక అన్నమాటే మళ్ళీ అంది. రామచంద్రుడు ఇంచుకసేపు మౌనంగా ఆలోచించి, "ఎంత కంటు పెట్టుకుంటే మాత్రం ఇల్లు ఖాళీచెయ్యమంటాడా! అదేందో ఆయన్నే అడగతానుండు" అన్నాడు. అతడు తిన్నెమీదున్న తువ్వాలుగుడ్డను తీసి భుజానవేసుకుని అగ్రహారంవైపు బయలుదేరాడు.

రామచంద్రుడు చీకటిలోపడి నడవసాగాడు. మిణుగుర పురుగులు మందకొడిగా ఎగురుతున్నాయి. సందెవేళ నుండి అవిరామంగా ఎగురుతూ అవి అలసిపోయాయేమో లేక రాత్రిగడిచేకొద్దీ అంతకంతకు చిక్కనవుతున్న చీకటిని చీల్చడం వాటికి కష్టతరమవుతున్నదేమో.

రామచంద్రుని ఆలోచనలు కకావికలుగా ఎగురుతున్నాయి. అతనిని పొగిడినట్టుగా పెదరెడ్డి మరొకరిని పొగిడి ఉండడు "ఈ మాలపల్లిలో ఉండే యదవలంతా నాచు యదవలు గదరా. ఇంత ఊరులో పేగులూ, గుండికాయా ఉండే మొగోడు ఒకడు చెప్పు. రామచంద్రుని కుండే తెంపూ తెగవా మరి

(గత సంచిక తరువాయి)

నలగరికుంటే బంగారుతో గోడ పెట్టుకుందునే' అనేవాడు పెదరెడ్డి.

'పెదరెడ్డి'గారి పొలం సర్వస్వం రామచంద్రునికి కరతలామలకం ఆ నేల యొక్క స్వభావం. అది ఎన్ని కయ్యలుగా విభజింపబడి ఉండేదీ, ఏకయ్య ఎంత సత్తువ కలిగిఉన్నది అతనికి తెలుసు. పొలంచుట్టూవున్న సర్వేరాళ్ళూ, చెట్లూ, వంతెనలు, తోటలూ అన్నీ రామచంద్రుని నిత్య జీవితంలో భాగస్వాములుగా ఉండేవి. ఆ భూమిలోని ప్రతి అంగుళం అతని వొంటి చెమటతో తడిసినదే. అతని చేతి నాగలిచేత కోయబడినదే. ఆ పొలంలో తటాకాలంత బావులు మూడుండేవి. ప్రతి బావిచెంత నీరుతోడే ఆయిలు ఇంజను ఒకటి ఉండేది. ఒక బావిగట్టున గుడిసె వేసుకుని రామచంద్రుడు కాపురముండేవాడు. జీతగాడుగా ఉండిన రెండేళ్ల కాలం అతడా గుడిసెలోనే గడిపాడు. తను రెండేళ్ళపాటు

*జరిగినకథ :1* రామచంద్రుడు చేసిన చాకిరీకి ఫలితంగా ఇల్లుకట్టుకోవటానికి పోరంబోకు నేల ఇప్పిస్తాడు పెదరెడ్డి. రామచంద్రుడి భార్య నాగ. పెదరెడ్డి కోరినట్లు కోర్టుకెళ్లి దొంగ సాక్ష్యం చెప్పడు రామచంద్రుడు. పెదరెడ్డి రిపోర్టు చేయటంతో పోరంబోకు ఖాళీచేయమని రామచంద్రుడికి ఉత్తర్వు జారీ చేస్తాడు కలెక్టరు.

పడిన శ్రమకు ఫలితంగా తనకి ఇంటిస్థలాన్ని పెదరెడ్డి పట్టా చేయించాడు. ఆ ఇంటిస్థలం తనపరం కాబడిన రోజు అతనికి బాగా జ్ఞాపకమున్నది. రెండేళ్ల చాకిరి పూర్తి కాగానే రామచంద్రుడు 'పెదరెడ్డి'తో విన్నవించుకున్నాడు, 'గుడిసె ఏసుకోవాల సామి మాలపల్లి ముందరుండే పోరంబోకు చెక్క పట్టా జేసియ్యి సామి. నీపేర్జెప్పుకుంటా.' అని.

'పెదరెడ్డి' చాల తేలికగా, 'నెలనాళ్ళు పోయినాక కనబడు' అన్నాడు.

అప్పట్లో దేశంలో ఏదో గడబిడ తీవ్రంగా ఉన్నది. దేశంలో చాల ఆఫీసులతో బాటు లాండ్ రిజిస్ట్రేషన్ ఆఫీసు కూడా చాల రోజులపాటు మూసేసి ఉన్నారు. నెలరోజులు గడచిన పిదప రామచంద్రుడు మళ్ళీ 'పెదరెడ్డి' ముందు చేతులు కట్టుకుని నిలుచున్నాడు. 'రేప్పొద్దున రా. పట్టా జేసుకుందువు" అన్నాడతడు.

ఆ రాత్రి రామచంద్రుడు జాగరణ చేశాడు. తరతరాలుగా అతని వంశం వారు తమకని ఇంత ఆస్తి అంటూ కలిగి ఉండడం జరగలేదు. రేపు తను నాలుగు గుంటల నేలకు హక్కుదారుడు కాబోతున్నాడు. అతడా రేయి కనుకూర్కలేదు.

తెలతెల వారుతుండగానే అతడు 'పెదరెడ్డి'ని సందర్శించాడు. రెడ్డి అతనిని పదిమైళ్ళ దూరాన నున్న టౌనులోని లాండ్ రిజిస్ట్రేషన్ ఆఫీసుకు తీసుకెళ్ళాడు. రెడ్డి గుర్రపుబండిలో కూర్చుని బయలుదేరాడు. అతనితోబాటు బండిలో కరణం కూర్చున్నాడు. బండి ముందు భాగాన తోటివాడు వొదిగి కూర్చుని గుర్రాన్ని తోలుతున్నాడు. రామచంద్రుడు కొంతసేపు వొగురుస్తూ నడుస్తూ, మరికొంతసేపు పరుగెత్తినంత వేగంగా నడుస్తూ బండిని అనుసరిస్తున్నాడు. ఆ బండి కణికరాళ్ళతోను, బలసతుప్పలతోనూ నిండిన దారి గుండా నాలుగు మైళ్ళు పయనించి తారురోడ్డును పట్టింది. ఈలోగా రామచంద్రుని కాలి బొటనవ్రేళ్ళు రెండూ చెక్కుకు పోయాయి. పది గంటల పొద్దుకు వాళ్ళందరూ టౌనులోని లాండ్ రిజిస్ట్రేషన్ ఆఫీసు ప్రాంగణాన్ని చేరుకున్నారు.

తోటివాడు ఆఫీసు వద్దనున్న బిళ్ళ జవానుతో బాతాఖానీ కొట్ట నారంభించాడు. రెడ్డి, కరణాలు ఆఫీసు లోపలకు వెళ్ళిపోయారు. రామచంద్రుడు ఆఫీసు ఆవరణలో

గంగరావి చెట్టుకింద కూర్చున్నాడు. పది మైళ్ళు నడచివచ్చిన ఆయాసంగాని, చెక్కుకుపోయిన బొటన వ్రేళ్ళలోని మంటగాని అతనికి తోచలేదు తనకు స్వంతం కానున్న నాలుగు కుంటల నేలను గూర్చి ఆలోచిస్తూ, బొటన వ్రేళ్ళ నుండి కారుతున్న నెత్తురును తుడుచుకుంటూ కూర్చున్నాడు. రెడ్డి, కరణాలు ఆఫీసులోని జనంతో మాట్లాడుతున్నారు. వారందరూ పాంటులు, షర్టులూ ధరించి ఉన్నారు. ఒకతను పుల్ల రంగు టోపీని ధరించి ఉన్నాడు. అతని బొజ్జ సువిశాలమైనది గనుక నడుంమీద పాంటు నిలవడం లేదు. అలా నిలవలేని పాంటుకు ఆసరాగా ఉన్న రెండు పట్టీలు బొజ్జ మీదుగా భుజాలమీదకి పోతున్నాయి.

సమయం పన్నెండు గంటలు అయిందని సూచిస్తూ టౌనులో ఎక్కడో సైరను మ్రోగేదాక వాళ్ళు అలా మాట్లాడుతూనే ఉన్నారు. తరువాత వాళ్ళ పనుపున ఒకడు వచ్చి గంగరావిచెట్టు క్రింద కూర్చుని ఉన్న రామచందుడిని లోపలకు తీసుకెళ్ళాడు. వాళ్ళంతా రామచంద్రుడిని వివితంగా చూశారు. బిళ్ళ బంట్రోతు అతని చేతి బొటన వ్రేలికి కందెన వంటి పదార్థాన్ని పూసి మూడు కాగితాలమీద వేలి ముద్రలు వేయించుకున్నాడు. ఆ కాగితాలమీద ఏమి రాసి ఉన్నదో రామచంద్రునికి తెలియదు. దోసెడు నల్ల చీమలను చంపి ఆ కాగితాల మీద పోసి ఉన్నట్లు అతనికి అనిపించింది.

తిరుగు ప్రయాణంలో రామచంద్రుడొకడే వచ్చాడు. రెడ్డి రూపాయ నోటు నొక దానిని తీసి అతని చేతిలో పెట్టి, 'ఇంద హోటల్లో యాడన్నా బొంచేసి పొద్దు పోయేలోగా ఊరు చేరుకో. రేపటి నుంచి ఆ జాగా నీదే. ఇల్లన్నా కట్టుకో, ఉద్యాన వనాలన్నా వేసుకో' అన్నాడు.

మరునాడు వేకువజామునే రామచంద్రుడు అతని భార్య పార, పలుగూ కత్తి వగైరాలతో వచ్చి ఆ స్థలాన్ని బాగు చేయడం ప్రారంభించారు. రెండు వారాలు శ్రమించి అటనున్న రాళ్ళ కుప్పలను, ముళ్ళ తుప్పలను, కలబంద పొదలను ఈత చెట్లను నిర్మూలించారు. మరి రెండు వారాలు శ్రమించి మిట్టలను కొట్టి పల్లాలకు తోసి స్థలాన్ని సమతలం చేశారు. ఇంతలో తొలి ముంగార్ల వానలు ప్రారంభమయ్యాయి. మొదట రాళ్ళ వాన పడింది. రెండు వారాలు ముసురు పట్టింది. ముసురు తెరిపిచ్చి, తేమ తీశాక రామచందుడు గృహ నిర్మాణ కార్యక్రమాన్ని ప్రారంభించాడు. ఆ ప్రాంతంలోని జోతిష్కుడిని సంప్రదించి ఇంటికి పునాది రాయి వేశాడు. మట్టిని తవ్వడం, మట్టిని నీటితో కలిపి త్రొక్కడం, ఆ మట్టిని ముద్దలుగా జేసి గోడ పెట్టడం— అన్నీ రామచంద్రుడూ, అతని భార్య స్వహస్తాలతో చేశారు. ఇంటి పైకప్పుకు కావలసిన వెదుర్లు, వాసాలు, బోద వగైరాలను కొంతవరకు పైకం పెట్టి కొని, మరికొంత అప్పుగా తెచ్చారు. ఇంటికి నాలుగు వైపులా కిటికీలను అమర్చి వెదురు దబ్బలను కిటికీ ఊచలుగా ఉంచారు. ఇంటి చూరు విశాలంగా, పొడవుగా, క్రింద ఒక లిన్నె ఇమిడిపోయేట్లుగా అమర్చారు. వెన్ను కుప్పను అందంగానూ, పటిష్టంగానూ తీర్చిదిద్దారు. ఇంత చక్కగా నిర్మితమైన ఇంటికి దిష్టి తగలకుండా ఉండేందుకు వెన్ను కుప్ప మీద దిష్టి కుండను ఉంచారు. ఆ కుండ వెన్ను కుప్ప మీద ఈ నాటికీ ఉన్నది. దాని మీద ఉండిన సున్నపుపూత, మసిబొట్లు మాత్రం లేవు.

తను సంవత్సరంపాటు కాపురముండిన



ఇంటిని ఖాళీ చేయించడం ఎవరి తరం ? అనుకుంటూ రామచంద్రుడు చీకటిలో నడవ సాగాడు. మాలపల్లినీ, అగ్రహారాన్ని కలిపే సన్నటి కాలిబాట కిరువైపుల నిలుచుని ఉన్న చెట్లు తలలు విరియబోసుకుని పిశాచాలవలె ఉన్నవి.

రామచంద్రుడు అగ్రహారంలో అడుగు పెట్టాడు. అతడు ఊరి మధ్యనున్న పెద్ద రెడ్డిగారి భవంతి వైపు సాగుతున్నాడు.

### 3

అగ్రహారపు వీధులు చీకటిమయంగానూ, నిర్మానుష్యంగానూ ఉన్నాయి. వేసవి గనుక కొందరు రైతులు వీధులనానుకుని ఉన్న అరుగులమీద పడకలు వేసుకుని గుర్రు తీస్తున్నారు. కొన్ని ఇండ్లలో ఇంకా ప్రమిద దీపాలు వెలుగుతున్నాయి పసిపిల్లలు సందడి చేస్తున్నారు.

రెడ్డిగారి ఇంటి ఆవరణం పట్టపగలుగా ఉన్నది. ఆరోజు రెడ్డిగారు కోర్టులో గెలిచి నందుకు అతడు రేపు ఉదయం ఊరిబయట నున్న దేవాలయంలో స్వామివారికి అభిషేకం చేయించనున్నాడు. సన్నాహాలు భారీఎత్తున జరుగుతున్నాయి. ఇంటిముందు రెండు పెట్రొమాక్స్ దీపాలు వెలుగుతున్నాయి. హరిజనులు దాదాపు ఇరవైమంది అట పని చేస్తున్నారు. భవంతి ముందున్న విశాలమైన ప్రాంగణాన్నంతటినీ కప్పుతూ పందిరి వేస్తున్నారు. గోతులను త్రవ్వి గుంజలను నాటుతున్నారు. కొబ్బరి మట్టలను చీల్చి కీతులు అల్లి పైన వేస్తున్నారు. అంచుల వెంబడి మామిడాకుల తోరణాలను వ్రేలాడ దీస్తున్నారు. ఆ ప్రాంతమంతా కొబ్బరాకుల పచ్చివాసనలతో నిండిఉన్నది.

ఒక పెట్రొమాక్స్ దీపం చెంతకొచ్చి రామచంద్రుడు నిలుచున్నాడు. అటనున్న హరిజనులెవ్వరూ అతనిని పలకరించలేదు. రేపు రామచంద్రుని నెత్తిన పిడుగు పడు నున్న వైనం వారందరూ ఎరుగుదురు.

ఎర్రని తలపాగా చుట్టుకుని కొబ్బరి మట్టలను చీలుస్తున్న సత్తిగాడు రామ చంద్రునివైపు చూసి, 'ఏంబిరా ఇట్టొచ్చి నావు ?' అనడిగాడు. హరిజను లందరు తాము చేస్తున్న పనులను మానివేసి రామ చంద్రుని సమాధానం కోసం ఎదురు చూడ సాగారు. వాళ్ల చూపులు సూదులవలె గుచ్చు కుంటున్నట్టు రామచంద్రునికి అనిపించింది.

## ఇన్‌క్రెడిబుల్ గాడెస్

ఇంచుక సేపటికి అతడు నోరు పెకలించుకుని, "ఊరికినే." అన్నాడు.

సత్తిగాడు పెద్దగొంతుకతో, "ఊరికినే అని నోటితో అంటే సరిపోతుందా. నీచేతిలో కాయితం ఈడెవురికీ కనపడ లేదనుకున్నావా? నువ్వెందుకొచ్చినావొ మాకు తెల్సు. పెదరెడ్డి కాళ్ళమీద బడి ఇల్లు కాపాడుకుందామని వచ్చినావు. అదయ్యే పనిగాదు. ఆయనింకా టౌనులోనే ఉన్నాడు. రేపుమధ్యాహ్నానికిగాని రాడు. ఇంగ దయచెయ్యి" అన్నాడు.

రామచంద్రుడు మౌనంగా నిలుచున్నాడు. పెట్రొమాక్స్ దీపం బుస్సుమని సద్దుచేసు




"గురూ! బ్లాకులో టిక్కట్లు అన్నీ అయిపోయాయట — మామూలు బుకింగ్‌లో ట్రై చేయమన్నావా ?"

కుంటూ వెలుగుతున్నది. దాని చుట్టూ దీపం పురుగులు హడావిడిగా తిరుగుతున్నాయి కొన్ని పురుగులు అద్దాన్ని ఢీకొన్నప్పుడు టంగుమని చప్పుడు వినిపిస్తూంది. ఢీకొన్న మరుక్షణమే అవి భూపతన మవుతున్నవి.

రామచంద్రుడు గొంతు సవరించుకుని, "పెదరెడ్డి మధ్యాహ్నమే వచ్చినాడని వింటినే—" అంటూ ఏదో చెప్పబోయాడు.

సత్తిగాడు "ఒరే. నీ క్రాసు కొచ్చిన్లన్నీ ఈడ అడగొద్దు. పెదరెడ్డి ఇంకా రాలేదంటె రాలేదు అంతే" అని ఖరాఖండిగా చెబుతున్నట్టు తలను చేతులను ఆడించి, తన పనిలో మునిగిపోతూ, మళ్ళీ "ఒకవేళ వచ్చిఉన్నా నీకు కనబడి మాట్లాడాలని ఆయనకేమన్నా రూలా" అంటూ ఒక తిరకాసు పెట్టాడు.

రామచంద్రుడు "ఆయనొచ్చి ఉంటే చెప్పన్నా, ఏదో నా గొడవ నేను ఆయనతో చెప్పకుంటా" అన్నాడు.

'ఇంగ చెప్పకునేదేంది ? తాకీదు అందు కున్నావుగదా. మూట ముల్లె సర్దుకుని రేపు పొద్దు నాలుగు బారలెక్కేలోగా ఇల్లు ఖాళీ చెయ్" అంటూ సత్తిగాడు కొబ్బరిమట్టను చీల్చి వదిలిపెట్టాడు. పట్టప్రరుమని చప్పుడుచేస్తూ చీలగా దాని రెండు సగభాగాలు అటొకటి ఇటొకటి కూలబడ్డాయి.

చీల్చబడిన మట్టవైపు ఇంచుక సేపు చూసి రామచంద్రుడు "సంవత్సరంపాటు కాపరముండిన కొంపను ఖాళీచెయ్యమనే దేందన్నా, ఇట్టా ఇద్దూరం మన మాల పల్లిలో ఎప్పుడన్నా జరిగిందా" అన్నాడు.

"నీయట్టా యిద్దూరపు మాలోడు ఇంతవరకు ఈ ఊర్లో పుట్టలేదుగదా" అన్నాడు.

రామచంద్రుడు తల ఎత్తి "అట్టాంటి పన్లు నేనేవి చేసేసినానంటావు?" అన్నాడు.

ఆ ప్రశ్న ప్రపంచాన్ని తలక్రిందులు చేసెయ్యబోతున్నట్లుగా అటనున్న హరిజను లందరూ ఆశ్చర్యపోయారు. కొందరు తాము చేస్తున్న పనులను పూర్తిగా వదలివేసి, మరి కొందరు అసంకల్పితంగా పనిచేస్తూ రామ చంద్రునిపై చూపులు నిలిపారు.

సత్తిగాడు కత్తిని నేలమీదుంచి 'ఏమీ తెలవనట్లు నోట్లో వేలు పెట్టే కొరికేదాని గ్గాడా తెలవనట్లు మాట్లాడతా ఉండావు గదరా. పోయిన పోర్నవినాడు నువ్వు జిడ్డోని చెరువు కింద గూడ ఏస్తా ఉంటే నీకాడి కొక మారాజొచ్చినే గ్యాపకంలా?' అన్నాడు.

రామచంద్రునికి బాగా జ్ఞాపక మున్నది. ఆపూట అతడు చెమటలు కార్చుకుంటూ గూడవేస్తున్నాడు. ఒక సన్నటి గనిమ మీద నడుస్తూ పెదరెడ్డి అతని చెంత కొచ్చాడు. కరణం ఒక చేతికి అసరా ఇస్తుండగా. వెనక నుండి ఒక హరిజనుడు గొడుగు పట్టు తుండగా. అందరి కన్న ముందుగా తోటి వాడు నడచి దారి చూపుతుండగా పెదరెడ్డి రామచంద్రుని చెంతకు వచ్చాడు.

'గ్యాపకం లేకేమన్నా. ఆ పొద్దొచ్చింది పెదరెడ్డే కదా' అన్నాడు రామచంద్రుడు.

# స్టేన్స్‌టైర్
# సమస్యలను పరిష్కరిస్తుంది



స్టేన్స్ టైర్ రీట్రెడ్‌లు సురక్షితమైనవి. ప్రఖ్యాతి గాంచిన టైర్‌సోల్స్ సాంకేతిక పరిజ్ఞానాన్ని స్టేన్స్‌టైర్ వినియోగించు కుంటుంది. మీటైరు ఎక్కువకాలం పనిచేసేటట్టు గ్యారంటీ ఇస్తుంది.

స్టేన్స్ టైర్ ఎక్కువ ఆదాచేస్తుంది. ప్రతి కేసింగ్‌కు ఎక్కువ రీట్రెడ్‌లు చేయవచ్చు— కాగా లాభకరమైన అంశం. ప్రతి కిలో మీటరును లెక్కకడితే ఖర్చు అతితక్కువ కాగలదు. ముఖ్యమైన కేంద్రాలలో వున్న స్టేన్స్ టైర్ ఫ్యాక్టరీలు వెంటనే సేవచేయడంలో గణతి కెక్కినవి.

**STANESTYRE**

**స్టేన్స్‌టైర్**

అండ్ రబ్బర్ ప్రొడక్ట్స్ లిమిటెడ్
తిరుచి రోడ్, కోయంబత్తూరు

ఫ్యాక్టరీలుగల ఇతర కేంద్రాలు: మద్రాసు. వెల్లూరు, తిరుచి, సేలం, మదురై, ట్యుటికోరన్, బెంగుళూరు, మెంగుళూరు, విజయవాడ, సికింద్రాబాద్, ఎర్నాకుళం, కొట్టాయం, కాలికట్, తిరుపూరు.

# ఇన్‌క్రెడిబుల్ గాడెస్

సత్తిగాడు అతని వైపు సూటిగా చూస్తూ 'వచ్చి ఏఁవడిగినాడు' అన్నాడు.

'అంతా మీకు తెల్సిందే గదన్నా' అని రామచంద్రుడు ఒకసారి ఎంగిలి మింగి, 'కోరుట్లుకొచ్చి దొంగ సాచ్చి చెప్పమన్నాడు' అన్నాడు.

'నీయమ్మ ను...' అంటూ సత్తిగాడు నేలిమీదున్నకత్తిని చేతిలోకి జివురుకున్నాడు. ఆ చేతి వేళ్ల కొనలు తగిలి నేలమీది ఇసుక రేణువులు చెదిరిపోయాయి. "తిని కొవ్వు కండ్లకడ్డ మొచ్చిందిరా నీకు దొంగ సాచ్చంటావు గదరా" అంటూ వాడు లేచి రామచంద్రుని వైపు వురక బోయాడు.

ఇంతలో దాపున పనిచేస్తుండిన మరొక హరిజనుడు సత్తిగాడిని బలంగా వాటేసుకుని ఆపి, "ఊరికే ఉండ్రా. వానికి జరగాల్సిన పూజ జరిగిపోయింది గదా. రేపీపాటికి కొంపాగోడా వొదిలేసి అలోచిస్తా అని పోతా ఉంటాడు. వానితో ఎందుకు నీకు," అన్నాడు.

సత్తిగాడు గసపోసుకుంటూ మళ్ళీ కూర్చున్నాడు. కత్తిని వాడు ఇంకా క్రింద పెట్టకనె "ఇంగొకసారి దొంగసాచ్చి అనేమాట అన్నావంటె నీవొళ్ళు తరిగేస్తా. ఇంత మాల పల్లెలో ఎవురికీ కనబడని దొంగసాచ్చి నీకు మాత్రం యాడనుంచి కనపడిందిరా" అన్నాడు.

చేతిలోని కత్తిని సత్తిగాడు నేలమీద పెట్టేంత వరకు ఆగి, రామచంద్రుడు. "నేను కండ్లతో చూడని దాన్ని చూసినట్లు కోరుట్లులో చెప్పమంటే యట్ల సెప్పేదన్నా' అన్నాడు.

వెటకారంగా సత్తిగాడు చేతులు తిప్పి "ఒరి ఒరి యిరాటపరంలో కంకుభట్లు మాదిరి మాట్లాడతా ఉండవు గదరా. అంతగా అగ్గిని చేతబట్టుకుని బతికేటోని వైతే ఇప్పుడు ఊపుకుంటూ ఇట్లెందు కొస్తివి" అన్నాడు.

రామచంద్రుడు తన చేతిలోని కాగితం వైపొకసారి చూసి "నిల్చి నిలువున ఇల్లు కాళీచెయ్యమని తాకీదొచ్చిందన్నా. ఇల్లు కాళీ చేసి బిడ్డ పాపల్తో నేను ఎవరి పంచన పడుండు ?" అన్నాడు.

'ఎవురి పంచనన్నా జేరితే చేరనిచ్చేదానికి

(36 వ పేజీ చూడండి)

సీరియల్

# మగదిక్కు

## పైడిపాటి సుబ్బరామశాస్త్రి

(గత సంచిక తరువాయి)

శేషయ్య మళ్లీ ఇలా అన్నాడు :

"చిన్నప్పుడు ఆ సూర్యంగాడికే యిచ్చి పెళ్లి చేస్తే యీ సమస్య పరిష్కారమయివుండేది కదా, ఎంతచెడ్డా మేనల్లుడుముండాకొడుకు కదా! అని అప్పుడప్పుడు అనిపిస్తూ వుంటుంది విసుగుదల కలిగినప్పుడు.

అది మనోదౌర్బల్యం, నిరాశ చేత కలిగే భావమేకాని ఆ సూర్యానికివ్వడం యెల్లా సంభవం? వాడికి పొట్టకోస్తే అక్షరంముక్క లేదాయె! వాడు థర్డుఫారమ్ గ్రాడ్యుయేటు ఆయె! పోనీ వేదమన్నా పూర్తిగా చదువుకున్నాడా అంటే, అదీ లేదాయె! చెప్పుకున్నది వట్టి పురోహితవు ముక్కలాయె! ఇల్లాంటివాడికి ఘనాపాటీ సంభావన రాదుకదా!

వీడికి విస్తిస్తే, రేపు మీ అల్లు డెక్కడున్నాడని అడిగితే, అరండేలు సత్రం సెంటరులో అరుగుల మీద వున్నాడనో, లేదా ఫలానా వాళ్ల యింట్లో తద్దినం భోక్తగా వున్నాడనో చెప్పుకోవాలి. ఆస్తిపాస్తుల విషయం పట్టించుకోకపోయినా, శ్రుతి కలువని దాంపత్యం యెల్లా కూర్చడం?"

సరోజిని మాట్లాడలేదు.

"చింపి యెప్పుడో ఆశ వదులుకుంది. సూర్యంగాడికి అసలు ఆశే లేదనుకో!"

"నాన్నా! నీవు నాకు పెళ్లి చేయలేవనీ, తర్వాతకూడా, నాఅంతట నేను చేసుకోలేననీ, నా జీవితం వృధా అయిపోతుందనీ, నీ అనుమానం, అంతేనా?"

"అంతే, తల్లీ! అదీకాక మగదిక్కులేని ఆడది 'పుల్లాకు' కంటె తేలికమ్మా! దానికి రక్షణ వుండదుకదా! దానికి బ్రతుకు దిన దిన గండం!"

"మగదక్షత వున్నదని బుజావు చేయడానికేనా, నాన్నా! రోజూ సాయంత్రం స్కూలుకు నువ్వు వస్తూవుంట! అందుకు మా తోడి టీచర్లు ఆక్షేపిస్తున్నారు నాన్నా! ఇల్లేమో దగ్గరాయె! ఇంతలోపుగా సరోజినిని పిల్లెత్తుకుపోతుందని వాళ్ల నాన్నకు భయం అని అనుకుంటున్నారు, నాన్నా!"

"ఇవాళ నుండి రానులే అమ్మా! చెప్పావుగా! నిన్ను నీ తోటివారు ఆక్షేపించడానికి వీలయిన పని నేనెందుకు చేయాలి?"

"నీకు మనస్సులో కష్టం కలిగిందా, నాన్నా!"

"లేదమ్మా!" అని నిశితంగా చూశాడు.

"ఒక్క విషయం. బస్సీలో, బజారులో అంటే వీధిలో, ఒంటరిగా వెళ్లే ఆడదాన్ని చూస్తే అలుసు. అందరి కళ్ళూ ఆమెనే పరకాయించి చూస్తాయి. అందులో ఉద్యోగంచేసే ఆడదాన్ని యింకా పరిశీలనగా చూస్తారు. వీధిలో నడిచే ప్రతి మగవాడూ పెద్దమనిషి అని అనుకోవడానికి వీలు లేదుకదా! అందులో కొంటెవెధవ లుంటారు రౌడీ లుంటారు. లఫంగులుంటారు.

కొంటెవెధవలు ఆడది మంచి చీర కట్టుకు వెడుతూవుంటే వెనుకనుండి చీరమీద సిరా చిమ్ముతారు. రోడ్డు విశాలంగా వున్నా, ఆడది రోడ్డువెంబడి ఒకప్రక్క ఒదిగి ఒదిగి నడుస్తూ వున్నా, వీళ్లు కావాలని వాళ్ల ప్రక్కగానే నడుస్తారు. వాళ్ళాగితే వీళ్ళుకూడా ఆగుతారు — ఏదో పని వున్నట్లుగా. నీవెందుకు నాప్రక్కన నడుస్తున్నావురా, అని వాణ్ణి వీళ్ళు అడుగలేరుగా! అడిగితే రోడ్డుమీద నీకు యెంత హక్కు వుందో నాకూ అంత హక్కు వున్నదంటాడు. లేదా నువ్వే నా ప్రక్క కావాలని నడుస్తున్నావంటాడు! కొంతమంది సైకిలుమీద వచ్చి రాసుకు మరీపోతారు, వెనుకనుండి. లేదా సైకిలు దారి కడ్డం పెడతారు — తమ అస్తిత్వం ఆ ఆడది గమనించాలన్నట్లుగా! తిట్టిపోస్తే ఎదురు తిరుగుతారు బస్సీలో ఒకరికీ ఇంకొకరికీ సంబంధం వుండదు కనుక, దారుణమైన విషయాలు జరుగుతూవున్నా, దారే పోయేవాళ్ళు పట్టించుకోరు.

రౌడీలను గురించి యెంత తక్కువగా చెబితే అంత మంచిది. పోకిరీ లక్షణంతో పొట్లగిత్త క్రుమ్మినట్లు మనిషిని సైడు కాలువలోకి త్రోసి ఆనందిస్తారు. ఇరుకు సందుల్లో కావుపేసి అవమానిస్తారు. కథ అడ్డంతిరిగితే, వాళ్ళలో వాళ్ళే పెద్దమనుష్యులుగా వచ్చినట్లుగా వచ్చి, తప్పు చేసినవాణ్ణి మందలించినట్లుగా నటిస్తారు.

దొంగజాతి కూడా ఒకటి వున్నది. మనిషి వెడుతూవుంటే ప్రక్కనుండి మెడమీద దురద మందు చల్లుతారు. మెడ సర్దుకునేలోపుగా వస్తువులు తెంపుకుపోతారు — ఇరుకు సందుల్లో. ఈమధ్య ఒక మహానగరంలోనే, ఒకామె రిక్షాలో వెడుతూవుంటే, ఒకడు సైకిలుమీద వెనుకనుండి బయలుదేరి, ఒడుపుగా మెడలో బంగారుగొలుసు ఎగరేసి లాగి, ఉడాయించాడు, రిక్షా ఒక సందులో మలుపు తిరుగుతూవున్నప్పుడు. వేగంగా సైకిలు త్రొక్కుకుపోయి జనంలో కలిసిపోయాడు. వాడిని పట్టుకోవడం ఎట్లా?

**జరిగిన కథ-3:** కొడుకు సూర్యానికి సరోజినిని యిచ్చి పెళ్లి చేయమని అన్న శేషయ్యని అడుగుతుంది చింపమ్మ. ఆస్తి, చదువు లేని సూర్యానికి సరోజినిని యివ్వటానికి ఒప్పుకోడు శేషయ్య. ఉన్న ఆస్తి సరోజిని చదువుకి కరిగిపోగా గత్యంతరం లేక హైస్కూల్లో టీచరుగా చేర్పిస్తాడు శేషయ్య. సూర్యం మంచి పురోహితుడుగా పేరు సంపాదించుకుంటాడు. ప్రయివేటుగా ఎం. ఏ. పూర్తి చేస్తుంది సరోజిని. తను తన భర్తకు ఎలా దూరమయ్యిందీ సరోజినికి చెప్తుంది తోటి టీచరు సురేఖ. తను తన సంపాదన దాచుకోవడం అన్నకి కంటగింపుగా వుందని అతని మాటలవల్ల గ్రహిస్తుంది సురేఖ.

లఫంగులంటే చేతకానివాళ్లు. వీళ్ళు ఆడది దారివెంట పోతూవుంటే ఏదో ఒకటి వాగుతూనే వుంటారు, సన్న సన్నగా. పైకి పెద్దమనుష్యులల్లే కన్పిస్తారు. ఆడవాళ్ళను ఏదోవిధంగా పలుకరించాలని ప్రయత్నిస్తారు. మర్యాదగానే మాట్లాడుతూ ఆ ఆడది సమాధానం యివ్వకపోవడం భావ్యం కాదేమో అన్నంత జాగ్రత్తగా వ్యవహరిస్తారు. ఆడది సమాధానం యిస్తే, అంతటితో ఆగకుండా గొలుసుమ పట్టుకు ప్రాకినట్లు సంభాషణ పెంచివేస్తారు. వాళ్ళిద్దరూ యెంతకాలంనుంచో అనుబంధం వున్న అప్తులేమో అని యితరులు అనుకునేటట్లుగా ప్రవర్తిస్తూ, వెకిలివేషాలు వేయడం ప్రారంభిస్తారు.

ఆడది బయటకు వెళ్లడం అంటే ఎంత కష్టం! ఇంటికి వచ్చేదాకా ప్రాణాలు గూడుపట్టవు. మగవాడు సమర్థుడయి సంపాదించి, ఆడవాళ్లను పోషించినంతకాలం, సమస్యలు ఇల్లాంటివి లేవు. కాని, ఆడ, మగ, ఉద్యోగాల కెగబడిన ఈ సంధి కాలంలో, కొన్ని ఇబ్బందులు తప్పవు. అందుచేత పరిస్థితులు గమనించి జాగ్రత్తగా ఉండడం అవసరం, మనము మంచి వాళ్లంకదా, మనకేమి భయంలే! లని బేఫర్వాగా వుండే రోజులు కావు."

"ప్రభుత్వం ఇల్లాంటివాళ్లను శిక్షిస్తుందికదా నాన్నా!"

"తప్పక శిక్షిస్తుంది. శిక్ష ఎప్పుడు? ఆడది సిగ్గు విడచి బయటపడాలి! సాక్ష్యం వగైరా సరిగా ఉండాలి. స్త్రీ కోర్టు చుట్టూ తిరగడానికి సిద్ధపడి వుండాలి. కేసును బుజావు చేసుకోవాలి."

"నాన్నా! నీ వేదన అర్థమయింది. నువ్వు నా క్షేమం కోరినవాడవు. నీకు నేను తప్ప ఎవ్వరూ లేరు. నాకు నీవే ముఖ్యమయినవాడవు. భగవంతుడు నీకు చాలాకాలం ఆయుర్దాయమిస్తే, నేను అదృష్టవంతురాలను."

"ఏమోనమ్మా! ఇవాళ చూసినవాళ్లు రేపు ఉండడంలేదు. ఎవరి ఆయుర్దాయం ఎంతో ఎవరు చెప్పగలరు? నువ్వు ప్రాజ్ఞురాలివి, నేను చెప్పవలసిన సంగతులన్నీ నీకు చెప్పాను."

"నాన్నా! ఒకవేళ జరుగకూడనిది జరిగినా, నీ అభీష్టానికి విరుద్ధంగా, నేను వివాహం లేకుండా మాత్రం ఉండిపోను. ఎవరినో ఒకరిని చేసుకుంటాను. సాధ్యమయినంతవరకు మంచి సంబంధమే చూసి చేసుకుంటాను."

"వినదగిన మాట విన్నానమ్మా! నా వేదన ఉపశమించింది."

ప్రతి నదికీ లంక ప్రదేశాల వుంటాయి. ఒండ్రు, ఇసక మేట వేసి లంకలుగా ఏర్పడితే దానిలో సాగుచేస్తారు. ఆ ప్రదేశం సారవంతమైన దవడంవల్ల, కూరగాయలుకాని, ఇతరములయిన పైర్లుకాని బాగా పండులై" కృష్ణానదికి పలు ప్రదేశాల్లో లంకలున్నయ్.

విజయవాడలో, పట్టణానికీ నదికీ మధ్య వున్న తట్టు కృష్ణలంక అంటారు. పట్టణానికీ ఆ కృష్ణ లంక అనబడేదానికీ మధ్య బందరు కాలువ ప్రవహిస్తోంది. కృష్ణానది ఆనకట్ట దగ్గరనుండి ప్రవహించే మూడు కాలువలలో బందరు కాలువ ఒకటి. మిగిలినవి రైవస్‌కాలువ, ఏలూరుకాలువ. పట్టణంలోనుండి మూడు కాలువలు ప్రవహించే ప్రదేశం ప్రపంచంలోనే అపురూపం.

సుమారు నలభై ఏళ్ల క్రిందట కృష్ణలంకలో ఇళ్లు లేవు. మనుష్య సంచారం తక్కువ. కొంత భాగం తుప్పలతో వుండేది. కొంత వ్యవసాయిక భూమిగా వుండేది. అప్పుడప్పుడు ఆ వ్యవసాయిక భూమి సాగు అవుతూ వుండేది. మరి కొంత భాగం తోటగా వుండేది. అయితే ఎప్పుడో ఒకప్పుడు కృష్ణ పొంగి ఆ ప్రదేశాన్ని ముంచివేసేది. వరద తీసిన తర్వాత వ్యావసాయకులు వెళ్లి వారి వారి ప్రదేశాలను చూసుకునేవారు.

ఈ వరద రావడం సంవత్సరానికి ఒకటి రెండు సార్లు జరిగేది. మిగిలిన సమయాల్లో నేల కన్పిస్తూనే వుండేది. దీనిలో కొంత భాగం స్మశానంగా పెక్కుమందిచేత వినియోగింపబడేది, దాని కిప్పటికీ స్మశానం లంక అనే పేరు వుంది కాని నదీతీరంలో ఏ ప్రదేశమయినా స్మశానంగా ఉపయోగించే ఆచారం వున్నది. అల్లాపాత ఊరి నుండి శవాలను కృష్ణాతీరానికి తీసుకువెళ్లే వంతెన పేరు 'పీనుగుల వంతెన'గా ఈనాటికీ ప్రసిద్ధమే. ఇటీవల నూతనంగా నిర్మింపబడిన పురపాలక సంఘ కార్యాలయానికి వెళ్లాలంటే, ప్రధానంగా ఆ వంతెన మీదనుండే వెళ్లాలి.

విజయవాడకు ఒకప్రక్క కృష్ణానది వుండడం వల్ల ఆ ప్రక్క పట్టణం పెరిగే అవకాశం కుంటుపడింది. కృష్ణానది అద్దరి గుంటూరు మండలంలో ఒక భాగం. ఆ ప్రక్క పట్టణం పెరిగే అవకాశం తక్కువయినా, కృష్ణానది ఆవతల సీతానగరంలో ఇళ్లు కట్టుకుని విజయవాడకు రోజూ వచ్చేవారు లేకపోలేదు, వారి సంఖ్య చాలా తక్కువ.

పట్టణానికి మిగిలిన దిశలలో కొన్ని మైళ్ల వరకూ, స్థలాల ధరలూ, ఇళ్ల ధరలూ పెరిగి పోయినై. స్వభావంగా విజయవాడకు పెరిగే అవకాశం వుండడం అనేదే కారణం కాకుండా, ఆంధ్రరాష్ట్రం వస్తే విజయవాడ రాజధాని అవుతుంది అనే వదంతికూడా కొంత కారణం అయింది. అప్పుడు కొందరి దృష్టి కృష్ణలంక మీద పడింది.

నిజానికి కృష్ణలంక, పట్టణంలో ముఖ్య ప్రదేశాలకు చాలా దగ్గరలో వుంది. ఇంచుమించుగా అనుకునే వున్నదని చెప్పవచ్చు. రిక్షా వగైరా సాధనాలు అక్కరలేకుండా చిటుకలో పట్టణంలో ముఖ్య ప్రదేశాలకు లంకలోనుండి రావచ్చు. అందుచేత కొందరు నిరుపేదలు కృష్ణలంకలోని ప్రభుత్వ భూమిని ఆక్రమించడం ప్రారంభించారు. ఇతరుల భూమిని ఆక్రమించడానికి వీలులేదు కదా!

అయితే వాళ్లకు అక్కడ క్రొత్తలో నివాసం కష్టమే అయింది. అప్పట్లో అక్కడకు వెళ్లి వుండడం చాలా సాహసం. ఎవరయినా వచ్చి చావకొట్టి, చెంబూ తప్పేలా పట్టుకుపోతే, దిక్కూ దివాణం లేదు. కూనీలు చేస్తే సాక్ష్యం దొరకదు. కాని పేదఱికం చాలా చెడ్డది కదా! నగరంలో ఇళ్ల అద్దెలు ఇచ్చుకోలేనివాళ్లూ, సొమ్ము పోసి స్థలాలు కొనుక్కోలేనివాళ్లూ, కొందరు అక్కడకు చేరారు. పాకలు వేసుకు వుండడం ప్రారంభించారు. వాళ్లలో కార్మికులు, బ్రాహ్మణులూ వున్నారు. అక్కడ చిన్న గుడిలాంటిదానిని ఏర్పాటు చేశారు. విజయవాడలో యిదికూడా ఒక పేట అన్నారు. దీని పేరు భ్రమరాంబాపురం అన్నారు.

వారిని చూసి మరి కొందరు చేరడం ప్రారంభించారు. స్థలాలు ఎవరయినా ఖాళీ చేయమంటే, చేయకుండా వుండడానికీ, వున్న ప్రదేశానికి సౌకర్యాలు చేసుకోవడానికి, ఆ చేరినవాళ్ళలో నాయకు లేర్పడ్డారు. ఆ నాయకులకూ, పట్టణంలో నాయకులకూ 'లింకు' ఏర్పడింది. ఊరికే స్థలాలు ఆక్రమించడం అనేది తగ్గింది. అది ఒక పేట అయింది. కార్మికు లెక్కువమంది అక్కడ చేరారు. ఇంకా అనేకవు బావతులవారు చేరారు. లారీ డ్రైవర్లకూ, కారు డ్రైవర్లకూ ఆ ప్రదేశం సౌకర్యంగా కన్పించింది. చేరారు. అది డ్రైవరుపేట అయిపోయింది. ఇంటిమీద ఇల్లు ఇరుకుగా పెరిగి పోవడం ప్రారంభించింది. ఎందుచేతనంటే ఏదయినా ఆపద వస్తే, మనిషి పిలిస్తే పలికే దూరంలో వుండాలి కనుక.

చేరినవారు అక్కడ కొందరు స్థిరంగా వుండలేకపోయారు. తమ పాకలమా స్థలాలను వదులుకోనూలేకపోయారు. అందుచేత అనధికారికంగా వాటిని విక్రయించి, మరొక చోటుకు చేరడం ప్రారంభించారు. ఈ లోపాయికారీ వ్యాపారాన్ని ఆమోదించి కొందరు అక్కడకు చేరారు. ఊళ్లో స్థలాలు యెక్కువ రేట్లకు అమ్ముకుని చవకగా కొనుక్కోవడం ప్రారంభించారు.

అది ఒక పేట అయేటప్పటికి వాళ్ళు జనాభా లెక్కలలోనూ, మ్యునిసిపాలిటీ లెక్కలలోనూ చేరక



తప్పలేదు. వాళ్ళు ఓటర్లుకూడా అయారు. వారి అవసరం ఊళ్ళో పదవులు కావలసినవారికి అవసరం అయింది. వీరు సౌకర్యాలకోసం డిమాండు చేయడం ప్రారంభించారు. అంతకుముందు ఎక్కడో వల్లకాట్లో ఇల్లు కట్టుకుని 'మేము చచ్చిపోతున్నాం' అని ఆందోళన చేస్తే యెవ్వరేం చెయ్యగలరు? అక్కడ వీళ్ళను ఇళ్ళు కట్టుకోమని యెవరు చెప్పారు? తేరగా స్థలాలు వచ్చాయని చేరారు! ఇప్పుడు మొర్రో అంటే ఏం లాభం? యెంతోకాలం నుంచి, సొమ్ముపోసి ఇల్లు కట్టుకొని, మ్యునిసిపాలిటీకి పన్నులు కడుతూ, కాపురాలు చేసేవారి సౌకర్యాలు ముందు చూడనక్కరలేదా? సొమ్మంతా తీసుకువెళ్ళి కృష్ణలో పోస్తారా?" అని ప్రశ్నించేవాళ్ళు కాస్త తగ్గడం ప్రారంభించారు.

ప్రమాదానికి గురి అయే ప్రదేశంలో వున్నవారిని అక్కడనుండి లేపివేయాలనే అభిప్రాయం ప్రభుత్వానికి వున్నా, అంతమందికి మరోకచోట స్థలాలు చూపించడం సాధ్యంకాదనీ, వారి రిస్కు మీద వారు వుంటున్నారనీ, వీలయినంతవరకు వున్నవారికి సౌకర్యాలు చేయడం మంచిదనే అభిప్రాయానికి వచ్చింది. పురపాలక సంఘం వారు వారికి రోడ్లు వేశారు. కరెంటు అధికారులు విద్యుచ్ఛక్తి సౌకర్యాన్ని కలిగించారు. మ్యునిసిపాలిటీ పన్నులు వసూలు ప్రారంభించింది. అక్కడివారు పట్టణంలో భాగమైపోయారు.

అనధికారికంగా ఆక్రమించినవాళ్ళకు సర్వ సౌకర్యాలూ జరుగుతూవుంటే, వాళ్ళు మహా పట్టణంలో భాగస్థులయిపోతే, ఆ పని మనం చేయలేకపోయినామే అని కొందరు విచారించడం ప్రారంభించారు. లంకలోని భూస్వాములకు తమ పొలాలూ, తోటలూ, ప్లాట్లు క్రింద వేసి అమ్ముకుంటే పొలంమీద విలువకంటె, గజామణి మీద విలువ అధికంగా వస్తుందని ఆశ కలిగింది. వాళ్ళ అమ్మకానికి పెట్టేటప్పటికి కొనిపించడానికి బ్రోకర్లు తయారయారు. ఈ దళారుల ప్రోత్సాహం వల్ల ఊళ్ళో స్థలాలూ, ఇళ్ళూ వుండి, కొనవలసిన అవసరంలేనివాళ్ళ కూడా, లాభాలు గడించవచ్చునని కొనడం ప్రారంభించారు. ఋణాలు అయి ఊళ్ళో ఇల్లు అమ్ముకున్నవాళ్ళు, అవసరంకొద్దీ ఒకచోటు తీసుకొని, దానిలో పాక వేసుకొని అయినా బ్రదుక వచ్చునని కొనడం ప్రారంభించారు.

క్రమ క్రమంగా, విశాలమైన వీధులూ, యెక్కువ స్థలం కొనేవాళ్ళూ చేరారు. పల్లెలనుండి వచ్చిపడి, పశువుల పాకలూ, గడ్డివాములూ పెట్టుకొని, పాల వ్యాపారం, పిడకల వ్యాపారం ప్రారంభించారు. అక్కడివాళ్ళకు అక్కడే వాటి సౌకర్యం ఏర్పడింది. క్రమంగా స్థలాల రేట్లు పెరిగిపోయినై. కొన్ని వీధులు తీర్చినట్లుగా ఏర్పడినై. కృష్ణా పుష్కరాల నిమిత్తం ప్రభుత్వం అక్కడ కొన్ని స్నానానికి సంబంధించిన సౌకర్యాలు కూడా కలుగజేసింది. రామాలయం వెలిసింది. పోస్టాఫీసు వచ్చింది. దుకాణాలు వెలిసినై. వరదలు వస్తున్నా, అక్కడివారు వాటిని లక్ష్యపెట్టడం మానివేశారు

బాగా వున్నవాళ్ళు, పునాదులు చాలా ఎత్తుగా వేసి కట్టడాలు ప్రారంభించారు. వరద వచ్చినా ఆ ఎత్తును మించి రాదని వాళ్ల అంచనా. పేదవాళ్ళు వరద సమయంలో తమ సామానులను, అక్కడ ఎత్తుగా కట్టిన పొరుగిళ్ళలోకి గాని, ఊళ్ళో చుట్టాల ఇళ్లకు గాని చేరవేయాలని నిర్ణయించు కున్నారు కాని, నివాసాలు వదలదలచుకోలేదు. కలెక్టరుగారు, పి. డబ్ల్యుడి. అధికారులు ముందుగా వరద హెచ్చరిక చేసేవారు — ప్రజల భద్రతకోసం.

కొందరు గబగబా సామానులు తీసుకువచ్చి బందరు కాలువ ప్రక్క కట్టమీద పెట్టుకు కూర్చుండేవారు. పురపాలక సంఘంవారు వరద బాధితులకు కొన్ని సౌకర్యాలు కలుగచేసేవారు.

"స్థలాలు ఊరికే వచ్చాయనీ, లేదా చవకగా వచ్చాయనీ, అప్పుడు ఇళ్ళు వేసుకున్నారు. ఇప్పుడేడిస్తే ఏమి లాభం! తెలిసి తెలిసి అక్కడ ప్రవేశించిన వాళ్లపై జాలి ఎందుకు చూపాలి? అనుకోకుండా ప్రమాదం సంభవించింది కాదుకదా!" అని అనుకునే వాళ్ళు కొందరు.

"పాపం! ఎక్కువ డబ్బు పెట్టి స్థలాలు కొనుక్కోలేరు. ఏదో ఆశపడి యిక్కడ వున్నారు. కష్టాలు వచ్చినై, ఆదుకోకపోతే ఎల్లా?" అనేవాళ్ళ కొందరూ కట్టమీద చేరేవారు. కృష్ణలంకలోని సంపన్నులు వారి ఏర్పాటు వారే చేసుకునేవారు. ఊళ్ళో వాళ్ల బంధువర్గం వారిని ముందే వచ్చి ఆదుకునేది. వరద రావడంచేత ఇళ్లలో దొంగతనాలు జరుగకుండా పోలీసులు చర్యలు తీసుకునేవారు.

ఆ సమయంలో కృష్ణమ్మ పరవళ్ళు త్రొక్కుతూ ప్రవహించేది. ఆ దృశ్యాన్ని చూడడానికి ఊళ్ళోనుండి కొందరు బయలుదేరి వచ్చేవారు. నడుము లోతునుండి, లేదా రొమ్ముల లోతు నీళ్లలో నుండి, కొందరు పెట్టెలు నెత్తిమీద పెట్టుకొని, కొందరు పిల్లలను నెత్తిమీద కూర్చోపెట్టుకుని బయటకు వచ్చేసేవారు. ఎప్పుడయినా హఠాత్తుగా కృష్ణ రావడంకూడా కద్దు. వీధులన్నీ జలమయ మయితే వాటిలో నడిపే చిన్న పడవలలోనుండి కొందరు ఒడ్డుకు చేరేవారు వస్తూ ఇళ్లల్లోకి పాములు కొట్టుకువస్తున్నాయని చెప్పేవాళ్ళు. ఏటా ఈ అనుభవాన్ని చవిచూచిన కొందరు నిబ్బరంగా బయటకు వచ్చేసేవారు. ఎప్పటికప్పుడే క్రొత్త అనుభవం కింద భావించేవాళ్ళ ఏడుస్తూ బయటకు వచ్చేవాళ్ళు.

కొందరు ఇళ్లల్లో సామానులు బయటకు తీసుకొనిరాకుండా, ఇంట్లోనే ఎత్తయిన ప్రదేశంలో పెట్టి, గరాగరిగా బయటకు నవ్వుతూ వచ్చేసేవారు. దానిని ప్రజ్ఞగాకూడా చెప్పేవారు.

"ఏముందీ! తెలిసిందేగా! వరద వచ్చింది నదికి పొంగడం ధర్మం. దాని పని అది చేసింది. ఈ పొంగు ఎన్నాళ్ళ ఉంటుంది? ఒకటి రెండు రోజులుంటుంది. మనిషికయినా అంతే, నదికయినా అంతే! తర్వాత చల్లారుతుంది. అంటే నది తీస్తుంది. మా యిళ్లల్లోకి మేము పోతాము!" అని తేలికగా అనేసేవారు. వీళ్ల మాటలు చూస్తే కొందరికి, విమానాలు బాంబులు వేసి పోతూవుంటే, షెల్టర్‌లో దూరి, అవి పోగానే, బయటకు వచ్చేవారి యుద్ధ స్థితి జ్ఞాపకం వచ్చేది. కృష్ణానదికి వరద అనేది ఒక క్రీడ అయితే, వీళ్లకి ఆ వరదను తట్టు కోవడం ఒక క్రీడగా వుండేది.

'వరద కృష్ణమ్మ'ను చూడాలని ఊళ్ళోనుండి వచ్చినవాళ్ళ పసుపు కుంకుమలతో కొబ్బరికాయలతో వచ్చి, వాటిని సమర్పించేవారు నదికి. వరదలను చూసి కృష్ణమ్మ సంతోషంతో పొంగిపోతోందని, వీళ్ళకూడా సంతోషంతో పొంగిపోయేవారు — పేదల పొట్లకు ఒకప్రక్క జాలిపడినా.

ఎన్ని చెప్పినా, ఈ దృశ్యం చూస్తే, పిల్లలకు ఖంగారుగానే వుండేది. ఉన్న చోటు వదలిరావడం, గుడిసె కప్పుతోకూడా మునిగిపోవడం, దానిమీద కెరటాలతో నది ప్రవహిస్తూ వుండడం, కారణంగా, వాళ్ళ ఏడవడం మొదలుపెడితే ఎంతటివారికయినా గుండె తరుక్కుపోయేది ప్రభుత్వం ఎన్ని జాగ్రత్తలు తీసుకున్నా, హఠాత్తుగా వరదలు వచ్చినప్పుడు ప్రాణ నష్టం కూడా వుండేది.

"నదీ గర్భంలో ఇల్లు కట్టుకోవడం బుద్ధి తక్కువ" అని కొందరు లెంపలు వేసుకునేవాళ్ళు తాత్కాలికంగా. వరద తీయగానే సంతోషంతో ఇల్లు చేరేవారు, సంవత్సరందాకా మళ్లీ భయంలేదని వరద దృశ్యం చూచిన కొంత కాలం, అక్కడ స్థలాలు కొనాలనుకునేవాళ్ళ తటపటాయించేవారు.

వరద సమయంలో ధర్మాధర్మ చర్చకూడా జరిగేది. "అసలు, నదీగర్భంలో, ఇల్లు కట్టుకొమ్మని ఎవరు చెప్పారు. కట్టుకోవడం శుద్ధ తప్పు. ఇదివరలో రజస్వలానంతర వివాహం చేసినవారికి శిక్షగా నదిలో ఇల్లు కట్టుకొమ్మనేవారు" అనేవాడు ఒక బ్రాహ్మణుడు నశ్యం పీలుస్తూ.

"మహా చెప్పావులే, ధర్మపన్నాలు! పెద్ద పెద్ద సోమయాజులుగారలే ఈ లంకలో ఇళ్ళు కట్టు కున్నారు. వారికంటె నీకు ఎక్కువ తెలుసా? ఒక చిటిక పొడుం యిల్లా తగలెయ్యి" అని చేయి చాపే వాడు యింకొక బ్రాహ్మణుడు.

"సోమయాజులుగార్లు చేసినంత మాత్రాన, తప్పు రైటు కాదోయ్ బావా! శాస్త్రం వీళ్ళందరి పైది. వాళ్లంతా ఎందుకు కట్టుకున్నారనేగా నువ్వు అడిగేది! చెబుతా, విను!

ఊరికి దగ్గరగా వుంటుంది.

త్రవ్వితే బారెడు లోతులో పిల్లికూనలను పెంచే వుదకం పడుతుంది.

వేసంగిలో మిగతా ఊరంతా పెనం మోస్తరుగా వుంటే, అర్ధరాత్రి వరకూ వేడిగాడ్పులు వీస్తూ వుంటే, కృష్ణలో వుండే కొద్ది నీళ్ళ మీది నుంచి ఆయినా చల్లగాలి వస్తుంది. చవకగా వచ్చింది. లేకపోతే ఎవరో దానమిస్తే వచ్చింది — ఆ స్థలం.

తెల్లవారేటప్పటికి కృష్ణా స్నానం చేయవచ్చు."

"నీకు యిప్పుడు నదీగర్భంగా కన్పిస్తోంది కనుక నదీగర్భం అని అన్నావు బాగానేవున్నది. పటమటలంక కూడా ఒకప్పుడు నదీగర్భమటగా!"

"అది నాకు తెలియదు. నేను ధర్మం చెప్పాను. వినకపోతే అనుభవిస్తారు. కొన్నాళ్ళు వరదలూ, కొన్నాళ్ళ గృహదహనాలు, ఇల్లాంటి ఉత్పాతాలన్నీ కానిచోట్ల ఇల్లు కట్టుకున్నవాళ్ళకి వస్తాయి."

**బాతాఖానితో పక్కవారిపని**
**పాడుచేయకండి! అదే క్రమశిక్షణ**

"వాల్లాలులే! ఎవరయినా వింటే తిడతారు. నువ్వు చెప్పినవన్నీ నదీగర్భంలోనే కాక మిగతాచోట్ల కూడా వస్తున్నై. అయినా దీనికి లక్షలరూపాయలు పెట్టి కరకట్ట పోస్తారు. అప్పుడు కృష్ణలోనుండి యీ భాగం విడిపోతుంది."

"అప్పుడు రక్షిత నదీగర్భం అవుతుందికాని, నదీగర్భం కాకుండాపోదు."

"ఎందుకు బావా! యీ మాటలు. నువ్వు యీకాలానికి పనికివచ్చేవాడివికాదు. అసలు నదులను బంధించి ఆనకట్టలు కట్టవచ్చునంటావా?"

"నేనోకటి చెబితే నువ్వొకటి చెబుతావేం?"

"అసలు మనం మాట్లాడకుండా వుండడం మంచిది."

"అవును. నీ పని అయిపోయింది. నా పొడుం డబ్బా ఖాళీచేశావుగా!"

పై విధంగా ప్రసంగం నడిచేది.

ఏమయినా కృష్ణ కరకట్ట పోయడం జరిగింది. బందరులాకుల దగ్గర వంతెనకాక, కృష్ణలంకకు ఊళ్ళోవాళ్లకూ రాకపోకల నిమిత్తం వంతెనలు వేయడం జరిగింది.

హైస్కూలు వచ్చింది. బాంక్ వచ్చింది. కృష్ణలంక అనే పేరు ఒకటే వున్నా, దానిలో చాలా చిన్న చిన్న పేటలు వెలిసినై.

భాస్కరరావుపేట, డ్రైవరుపేట, చౌదరి పేట, హరనాథపురం, నాయుడుపేట, అగ్రహారం, గౌతమీనగర్, నెహ్రూనగర్, ద్వారకానగర్, ప్రకాశం నగర్, బాలాజీనగర్ — కృష్ణలంకలో పేటలు.

అందులో అగ్రహారంలో సురేఖ తండ్రి చవక రోజులలో స్థలం సంపాదించాడు. ఆరు వందల గజాల స్థలానికి చుట్టూ కారురాయి పునాది వేసి ఒంటి రాతి ఇటుకలో ప్రహరీ గోడ నిర్మించాడు. గేటు పెట్టాడు.

తర్వాత సిమెంటు కొని అచ్చులతో సిమెంటు రాయి తీసి ఆ ఆవరణలోనే రెండు ఇళ్లుగా వేశాడు. కిటికీలు సిమెంటువే. పై కప్పుకూడా సిమెంటు రేకులే. చూడడానికి చాలా అందంగా తీర్చినట్లుగా వుంటుంది ఆ యిల్లు. చవకగానే తయారయింది.

కొడుకు లందరకూ చదువులు చెప్పించి పెళ్లిళ్లు చేశాడు. వారు వారి వారి ఉద్యోగాలు చేస్తున్నారు కూతుళ్లకు వైభవంగా పెళ్లిళ్లు చేసి అత్తవారింటికి పంపివేశాడు. సురేఖ మాత్రమే తనతో ఆ యింట్లో వుంటోంది.

మగపిల్లలందరికీ, అర ఎకరం పొలం, కొంత డబ్బూ ముట్టచెప్పాడు. వాళ్లు ఆ పొలాలు ఏనాడో అమ్ముకున్నారు. ఈ యిల్లు తన క్రిందే వుంచుకుని రాజయ్య పోషణలో వుంటున్నాడు. అందరికంటె రాజయ్య తక్కువ సంపాదన కలవాడు కావడంచేత ఆ యిల్లు రాజయ్యకు యిచ్చివేశాడు. దానిమేరకు విల్లుకూడా వ్రాశాడు.

ఆ యింటిలో జనం మూగారు. రోదన ధ్వనులు ప్రారంభమయినై.

## 13

"ఆయనకేం? అదృష్టవంతుడు. మహానుభావుడు — దైన్యం లేకుండా జీవించాడు కడుపెడు బిడ్డల తండ్రి అయినా. అనాయాసంగా మరణించాడు. కొన్నాళ్లు తీసుకోవడంకానీ, ఎవరిచేతనైనా చాకిరీ చేయించుకోవడంకానీ, ఏమీలేదు. చావంటే అల్లా వుండాలి! రాజా చావు చచ్చాడు వృద్ధుడు. పండిన పండు! ఆయనకోసం చింతించనక్కరలేదు. నిజానికి ఆయన శ్రాద్ధం పెళ్లి చేసినట్లుగా చేయవచ్చు!" అన్నారు కొందరు ఆ యింటిలో నుండి బయటకు వస్తూ.





టెలిగ్రాములమీద ఎక్కడెక్కడివాళ్లూ, కొడుకులూ, కూతుళ్లూ వచ్చేశారు. ఇంకా కొందరు రావలసివుంది. వస్తారని అనుకుంటున్నారు. ఇల్లంతా సమ్మర్దంగా వుంది. బయట వున్నవాళ్లు చెప్పుకుంటున్నారు ఆయనను గురించి. ఒకరిలా అన్నారు:

"అసలు ఆయనది గుంటూరట! విజయవాడ వచ్చి చాలాకాలం అయిందిట! ఆ పేటలో, ఆ పేటలో కొంత కాలం అద్దె యిళ్లలో శరణు చేసి చివరకు 'నా' అనే యిల్లు కట్టుకున్నాడు. స్వగృహంలో మరణించాడు. ఎంత అదృష్టం వుంటే కృష్ణా తీరంలో మరణం వస్తుంది?

"కృష్ణాతీరం అనకండి. అది చాలా దూరం దాకా వుంటుంది. కృష్ణానదీగర్భం అనండి. ఉచితంగా వుంటుంది. అగ్రహారం లంక నదీగర్భమే.



ఇక్కడనుండి స్మశానం లంక దగ్గరే. అదీ నదీగర్భంలోదే. ఇక్కడ మరణం, అక్కడ దహనం. సంతానానికి పెద్ద ఇబ్బంది లేకుండా, ఆ జీవుడు సౌకర్యాన్ని కలుగజేసుకున్నాడు." అన్నారింకొకరు — ఆయనకు పాడె కడుతూ.

"లోకంలో నూతేళ్లూ బ్రదికినవారు లేరూ? సహస్రమాసజీవి అనుకో! ఇంకా బ్రదుకకూడదని ఏమయినా వున్నదా? ఎంత పెద్దవాడయినా, తండ్రి కొంత కాలం యింకా బ్రదుకాలని వాళ్ల సంతానానికి వుండడం సహజం." అన్నారొకరు యింట్లో కొడుకులూ కూతుళ్లూ ఏడుపులు విని.

"ఎవరో ఒక కొడుకూ, ఒక కూతురూ దూరాన వున్నారట? ఇంతవరకు రాలేదట! ఇక వస్తారు అయినా వాళ్లకోసం శవాన్ని యింట్లో పెట్టుకు కూర్చోరు" అన్నదొకావిడ.

సురేఖ మూర్తీభవించిన శోకదేవత మోస్తరుగా కూర్చొని వుంది. ఆమె ఏడ్చినంత బిగ్గరగా యెవ్వరూ ఏడువలేదు. సురేఖ సెలవు చీటీ స్కూలుకు వెళ్లగానే, సురేఖ యెందుకు సెలవు పెట్టిందో తెలిసిపోయింది. సరోజిని, స్టాఫ్ రూములో యెవరినో సురేఖ చిరునామా అడిగి తెలిసికొని, సెలవు పెట్టి సురేఖ యింటికి వెళ్లిపోయింది. సురేఖను ఒక్కమారు కౌగిలించుకొని ఏడిస్తేనేకాని, సరోజినికి మనశ్శాంతి లభించలేదు.

"అక్కా! నాన్న వెళ్లిపోయారా!" అని సురేఖను కౌగిలించుకొని బావురుమని ఏడ్చింది సరోజిని. ఈ చెల్లెలెవరో ఇంట్లోవారికి అర్థం కాలేదు సురేఖను ఓదార్చడానికి వచ్చిన ఇరుగు పొరుగువాళ్లు, ఆమెతోపాటు సరోజినిని కూడా ఓదార్చవలసివచ్చింది. విజయవాడ యెంత బస్తీ అయినా, కృష్ణలంకలో కట్టుకున్నది అగ్రహారం కనుక, అక్కడి ఇరుగు పొరుగూ పల్లెటూరివాళ్లు మోస్తరుగానే మెలగడం సహజం. సురేఖ తల్లి అదృష్టవంతురాలనీ, భర్తకంటే ముందే పరలోకానికి వెళ్లిందనీ, వచ్చినవాళ్ళు అన్నారు.

వచ్చిన సురేఖ అక్కచెల్లెళ్ళు సరోజినిని వింతగా చూడడం ప్రారంభించారు. కుటుంబ సభ్యురాలివలె సరోజిని విలపిస్తూవుంటే వారి కాశ్చర్యం కలిగింది. సురేఖ ఏడుస్తున్నంతసేపూ సరోజినికి దుఃఖం ఆగడంలేదు. వారు సన్నగా ఆమె ఎవరని సురేఖను అడిగితే సరోజిని సంగతి సురేఖ వారికి యింకా సన్నగా చెప్పింది.

"అక్కా! నువ్వు ఎక్కువగా ఏడ్చి ఆరోగ్యాన్ని పాడుచేసుకోవద్దు. ఆయనకు ఆయుస్సు తీరిపోయింది. ఆయనేమయినా నేను బ్రదుకనని అన్నాడా? నువ్వేమయినా బ్రదుకవద్దని అన్నావా? మన చేతిలో లేనిదానికి మనం బాధపడి ప్రయోజనం ఏముంది?" అని సరోజిని సురేఖకు ధైర్యం చెప్పే స్థితికి వచ్చింది.

"ఆయన సంతానం అంతా పెద్దవాళ్లయి, వాళ్ల సంసారాలు వాళ్లు చేసుకుంటూ బిడ్డలనూ పాపలనూ ఎత్తి సుఖంగా వున్నారు. అంతోయింతో వాళ్ల పని బాగానే వున్నది ఎటొచ్చీ సురేఖ స్థితే, విచారకరమని, ఆయన నాతో బాధపడుతూ వుండేవాడ"ని చుట్టపుచూపుగా వచ్చిన ఒకావిడ అన్నది.

ఈ మాటలు విన్న సురేఖకు రాజయ్య మాటలూ, తండ్రి మాటలూ జ్ఞప్తికి వచ్చి తిరిగి పెద్దపెట్టున ఏడ్చింది. సరోజిని, సురేఖను ఒళ్లోకి తీసుకొని కన్నీళ్ళు తుడవడం ప్రారంభించింది. తక్కువ వయస్సుగల సరోజిని, ఎక్కువ వయస్సుగల సురేఖను ఒళ్ళోకి తీసుకోవడం, కొందరి కాశ్చర్యమనిపించింది. వీళ్ళిద్దరి స్నేహమూ అల్లాంటిది కాబోలు ననుకున్నారు. సురేఖ, సరోజిని ఒళ్లో పసిపిల్లకుమల్లే ఒదిగిపోయింది.

కొంతసేపటికి ఏడుపులస్థాయి తగ్గింది. తరువాతి కార్యక్రమం విషయం ఆలోచనలు ప్రారంభమయినై. పల్లెటూళ్ళలో అయితే, శవం ఊళ్ళో నుండి వెళ్ళేవరకూ, ఎవ్వరూ వంటకు నిప్పు రాజేయరు. బస్తీలో ఆ వీధిలోవారు మాత్రం కొందరు ఆ నియమం పాటిస్తారు. కనుక వెంటనే శవాన్ని తీసుకువెళ్లడం మంచిదనే నిర్ణయానికి వచ్చారు. పాడె అంతకుముందే కట్టబడివుంది. శవాన్ని స్నానం చేయించి, తీసుకువెళ్ళే సమయంలో మళ్ళీ పెద్దపెట్టున ఒకసారి ఏడ్చారు. ఆ సమయంలో ఏడ్పు నిగ్రహించుకున్నవాళ్లెవరూ లేరు.

"ఇక మా నాన్న మాకు కనబడడు. నిప్పుల పాలయిపోతాడు" అని ఏడ్చింది సురేఖ.

"అక్కా! ఈ శరీరం పంచభూతాత్మక మైనది. జీవుడు లోపల వున్నంతవరకే శరీరానికి విలువ. ఆ హంస లేచిపోయిన తర్వాత, ఆ శరీరం కుళ్లి వాసనకొడుతుంది. పురుగులు పడుతై. ఒక్కరోజుకూడా దానిని ఇంట్లో వుంచుకోవడం

# డాక్టర్ సలహాలు

వి. వి. బి. — అనకాపల్లి

చెమట ఎక్కువగా ఎందుకు పడుతుంది? అలా పట్టటము వలన ఏమైనా ప్రమాదమా? నివారణోపాయము తెల్పండి.

★ ఎక్కువగా చెమట పట్టడానికి కారణాలు చాలా ఉన్నా — వీటిలో ముఖ్యంగా పుట్టుకలోనే ఏర్పడే నిర్మాణ మార్పులు; థైరాయిడ్ గ్రంధి ఎక్కువగా పనిచేయటం (థైరోటాక్సికోసిస్); వేసవికాలంలో స్వాభావికంగాను, ప్రకృతిసిద్ధంగాను, కొన్ని మందుల వాడకం అనేవి ఎక్కువగా కనిపించే కారణాలు.

చెమట ఎక్కువ పట్టడంవల్ల పెద్దగా ప్రమాదం లేదు. శరీరం జిడ్డుగా ఉండి వ్యక్తికి చిరాకు కలిగించటం తప్ప.

నివారణకు, రోగాన్నిబట్టి సలహాగాని, వైద్యం గాని చెప్పటం లేక చేయటం మాత్రమే వీలవుతుంది.

వి. ఎల్. ఎన్. ఎస్. — గౌహతి

మా 8 సం.ల అబ్బాయికి 4 నెలల క్రితం చిన్న ఏక్సిడెంటువల్ల కుడికంటికి గట్టి దెబ్బ తగిలి చూపు పోయినది. డాక్టరు (ఆప్టిక్ నెర్వె)కి గట్టి దెబ్బ తగలటంవల్ల ఆ నరం తెగినదని చెప్పినారు. తిరిగి చూపు వచ్చే అవకాశం వున్నదా?

★ "ఆప్టిక్ నర్వ్" అనేది కంటికి మెదడు నుంచి వెళ్లే కీలక నరం. తెర (రెటీనా) పైబడిన ప్రతిబింబాన్ని అన్వయించి, గ్రహించి, జ్ఞాపక శక్తులను ప్రేరేపించి చూడగలిగేటట్లు చేసి; ఒక రంగు నుంచి ఇంకొక రంగుని — వేరుగా చూసేటట్లు సహాయపడే నరం తెగిన తర్వాత తిరిగి చూపు వస్తుందనుకోవటం (ఆ కంటిలో) — అనవసరపు ఆశ, ఆతృత, వ్యాకులత అని తెలియజేయటానికి విచారిస్తున్నాను.

ఎమ్. కె. ఆర్. — బొబ్బిలి

నాకు 18 సం.లు. నా పాదమునకు ముల్లు గుచ్చుకున్నది. అది తీసినాగూడా ఆ ప్రదేశములో ఆనెలు వచ్చినది. ఇది శీతాకాలములో, వర్షాకాలములో ఎక్కువ నొప్పిగా వుంటుంది. ఇది పోవుటకు మార్గమున్నదా?

★ "ఆనె"లనేవి సాధారణంగా, ముల్లు మొదలయినవి గ్రుచ్చుకోవటం ద్వారాగాని, గాయం తగిలి పుండు మానటం ఆలశ్యం అయినాగాని, పాదరక్షలు సరిఅయినవిగాక ఒత్తిడి కలిగించేవిగా ఉన్నాగాని రావటం జరుగుతుంది. వర్షాకాలంలో నెప్పి అధికమవటానికి — తడిలో పాదం ఎక్కువగా ఉండటం వల్ల అందులోనూ పగుళ్ళు ఉన్న ఆనెలలోకి సులభంగా ఈ నీరు (వాననీరు) సూక్ష్మక్రిములతో బాటుగా చేరి కొరివాపు కలిగించి నెప్పి కలుగజేస్తాయి. ఆనెలను సమ్మూలంగా శస్త్రచికిత్స ద్వారా తీసివేయటంవల్ల వీటిని పూర్తిగా పోగొట్టే మార్గం ఉన్నది.

వి. ఎస్. ఎమ్. — హైదరాబాద్

మా అమ్మగారి వయస్సు 40 సం.లు శరీరము అంతా నీరు పట్టినట్లు వచ్చినది. ముఖ్యముగా రెండు కాళ్ళు వేలుతో నొక్కితే గుంట పడుతాయి. ఈ విధముగా మూడు నెలలుగా వున్నది. ఇది పోవుటకు ఏమి చెయ్యవలెను?

★ మీలాంటి పాఠకులకు — మరొక విన్నపం — ఇలా "వాపు" అని వ్రాస్తే అసలు రోగిని చూడకుండా సలహా చెప్పడం కొంతవరకు హాస్యాస్పదమే! అందులోనూ మెడికల్ కాలేజీలో 'ఓరల్' పరీక్షలో అడిగినట్లు వ్రాస్తే ఎలాగండీ!

బ్లడ్‌ప్రెషర్, ఛాతీ ఎక్స్‌—రే; వైట్‌బ్లడ్ ఫర్ ఎం. ఎఫ్. అంటే మైక్రో ఫైలేరియల్ ఫైరసైట్ అని; "హార్ట్" యొక్క స్థితి. గర్భాశయం — తత్సంబంధ భాగాలలో ఏవైనా రోగాలు ఉన్నవీ లేనిదీ పరీక్షింపచేసి వివరాలు వ్రాస్తే, అదీ అక్కడ వైద్య సదుపాయాలు లేకపోతే, వ్రాస్తే వీలయినంత నాకు తెలిసినంతమేరకు — ఏ రోగమయినదీ తెలుసుకొని దానికి తగినట్లు మీకు సలహా (అడ్వైస్) ఇవ్వటానికి వీలవుతుంది.

టి. ఎస్. — గుంటూరు

నా వయస్సు 16 సం. లు నాకు 4 సం. ల నుండి చేతి వేళ్లపై పులిపిరి కాయలు చిన్నవిగా వచ్చినవి. ఇప్పుడు పెద్దదిగా ఆయినది. మందులు వాడినా ఫలితము కన్పించలేదు. గట్టిగా వుండి ఒక చోట నుండి మరొక చోటికి వ్యాపించుచున్నవి.

★ పై లక్షణాలు "మ్యారో ఫైబ్రమటోసిస్" అనే రోగాన్ని (నరాల చివర్లలో ఏర్పడే కాయులు)గాని. లేక "వార్ట్స్" వైరస్‌లవల్ల ఏర్పడే సమయంలోగాని ఏర్పడే అవకాశం ఉన్నది.

ప్రత్యక్షంగా చూడకుండా రోగ నిర్ధారణ కష్టం. వైరస్‌లవల్ల అయి సంఖ్య పెద్దగా లేకపోతే 'కెమికల్స్' వాడి వాటిని వెను వెంటనే కరిగించ వచ్చు.

నరాల సంబంధం అయితే చాలా కష్టం అసాధ్యం కూడా!

టి. కె. డి. ఆర్. — నెల్లూరు

ఒక జబ్బు గురించి అదేపనిగా ఆలోచిస్తే ఆ జబ్బు తనకు వచ్చే అవకాశము వున్నదా?

★ యిది యక్ష ప్రశ్నలలో ఒకటిగా ధర్మరాజుని అడిగి ఉంటే ఏం సమాధానం చెప్పేవాడో!!

— డా. కె. వెంకటేశ్వరరావు




సాధ్యంకాదు. దానిని చూస్తే ఎంత దగ్గరవారికయినా భయం కలుగుతుంది." అన్నది సరోజిని.

దింపుడుకళ్లాశతో శవాన్ని ఏడు చోట్ల దింపారు. వెంట్రుకవాసి ఎక్కడయినా ప్రాణం వుంటే, ఆ ఏడుచోట్లలో ఎక్కడో అక్కడ అది వ్యక్తమయి శరీరం కదులుతుందని ఒక ఆశ. సురేఖకు ఆ ఆశ కూడా లేదు చితిమీద పెట్టినప్పుడు "ఈ స్వరూపంకూడా కళ్లకు కనబడదుకదా, నాన్నా!" అని తిరిగి ఏడ్చింది.

సరోజిని శవాన్ని తీసుకువెళ్ళేవరకే వుండి, ఇంటికి వెళ్లి స్నానంచేసింది. తండ్రితో ఆ విషయం చెప్పింది. సురేఖ, చితిమీద తండ్రిని పెట్టిన తర్వాత, తలకొరివి పెట్టే దృశ్యాన్ని చూడలేక యింటికి వచ్చేసింది. అన్నలు, తమ్ములు యింటికి వచ్చిన తర్వాత "నాన్నను అగ్నిదేవుడి కర్పించి వచ్చారా? కాస్త సెగ తగిలితే అమ్మో! అనేవాడు. ఓర్చుకోగలిగేవాడు కాదు. అల్లాంటి శరీరం మొత్తం అగ్నికి ఆహుతి అయిపోయింది" అని ఏడ్చింది సురేఖ.

పోయిన నక్షత్రం మంచిదనీ, పైగా ఆయనను ప్రాణం పోకముందే బయట పెట్టడం జరిగిందనీ తేలింది. వచ్చిన చుట్టాలలో మంచివాళ్లు మడి కట్టుకొని వంట చేశారు. ఒకే కడుపున పుట్టినా, పెళ్లి అయిన ఆడపిల్లలకు తక్కువ రోజులు మైల కనుక, మూడు రోజులలో శుద్ధి అయిపోయి వారింట్లోకి వచ్చేశారు — బయట గదుల్లోనుండి. పదకొండవ రోజున జ్ఞాతులకు శుద్ధి అయి, పంద్రెండవ రోజున కర్మ చేసినవాళ్లకు శుద్ధి అయింది. రాజయ్య మొదలయినవారంతా కర్మ శ్రద్ధగా చేశారు. ప్రత్యక్ష గోదానం చేశారు. మూడు వేల రూపాయిలదాకా సమష్టిమీద ఖర్చుపెట్టారు.

[ఇంకా వుంది]

# కిన్నెర



దేశెట్టి కేశవరావ్

"రమా! మిమ్మల్నెవరో ఫోనులో పిలుస్తున్నారు!" కౌంటరు దగ్గర్నించి శశికళ ఇంగ్లీషులో అరిచింది.

"ఒక్క నిమిషం!" రమ షోకేసు అద్దంమీద పెట్టివున్న చందనం వస్తువుల్ని తిరిగీ లోపల సర్దుతూ అంది. అన్నిటినీ లోపల వుంచేసి, స్లైడు డోరు లాగేసి పరుగెత్తుకుంటూ కౌంటరు దగ్గర కొచ్చింది. బల్లమీద వుంచిన రిసీవర్ని చేతిలోకి తీసుకుని "రమా హియర్!" అంది. కాసేపు విని "ఓ, బావా! నువ్వేనా, ఏమిటి విశేషాలు?" అంది.

టెలిఫోను ఆమె చెవిలో కాసేపు గుసగుసలాడింది. "ఓ దానికేం భాగ్యం! అంత డబ్బు దొరికినప్పుడు అలాగే చేద్దువుగానిలే!" అంది. మరికొంతసేపు విని, "నువ్వు నిజంగా అంత గొప్పవాడివైతే మేము గుర్తుంటామా?" అంది.

తర్వాత ఫోను ఏం చెప్పిందో ఫకాలున నవ్వేసి "అలాగే, అలాగే!! చూడూ, యిప్పుడు చాలా బిజీగా వున్నాను. పీక్ అవర్! మాటిమాటికీ యిలా ఫోను చెయ్యకేం? వుంటానూ! మళ్లీ కలుసుకుందాంలే!" అనేసి, ఫోను క్రేడిల్‌లో వుంచేసింది.

శశికళ కనుబొమలెగరేసి ప్రశ్నార్థకంగా రమకేసి చూసింది. "ఏముందీ? మామూలే. మా బావకి మళ్లీ గొప్ప అయిడియా ఒకటి తట్టింది. డెబ్భై వేలుంటే ప్లాస్టిక్ పైప్స్ యిండస్ట్రీ పెడతాడట. ఇప్పటికి అయిదు వందలు మాత్రం సమకూర్చాడు!" అని వివరించింది రమ.

శశికళ మధురంగా నవ్వింది. "అయితే త్వరలో మాకు పప్పన్నం పెడతావన్నమాట!" అంది.

"అలాగే! అయిదు వందల పక్కన సున్నాలు చేరాలిగా! అవి చేరేసరికి నా పెళ్లిమాట కూడా సున్నా అయ్యేలాగుంది!" అని నవ్వేసింది రమ.

"అదుగో, అక్కడ తెల్ల చర్మంవాళ్లొచ్చారు. అమెరికన్లలాగుంది. ఇప్పుడొక అయిదు వందలకన్నా బిల్లు తప్పదు. గంటసేపు వాళ్లతో భేటీ తప్పదు!" అని విసవిసా తన సెక్షన్‌వేపు నడిచింది.

ఇద్దరు అమెరికన్లు — భార్యా భర్త — ఒక కుర్రాడు, వాళ్లబ్బాయి కాబోలు, తన సెక్షన్ దగ్గర వేచివున్నారు, షో కేసులోని వస్తువుల్ని చూస్తూ వాళ్లు కుతూహలంగా ప్రశ్నలడుగుతుంటే, అన్ని వస్తువులనీ చూపిస్తూ, వాటి వివరాలను తెలువుతోంది రమ. ఒక్కొక్క వస్తువునే జాగ్రత్తగా పరిశీలిస్తూ, వాళ్లు కావలసినవాటిని ఎంపిక చేసుకుంటున్నారు.

"మిస్ రమా! ఈ రోజు మానెక్విన్‌కి డెకొరేషన్ మార్చలేదేం!" మానేజర్ కామరాజు కంఠం హటాత్తుగా వినిపించింది.

రమ అతడి కంఠం విని తత్తరపడిపోయింది. తమాయించుకుని, "రొటేటింగ్ టేబిల్ చెడిపోయినట్టుంది సార్!" అంది.

"మరి మెకానిక్‌కి ఫోన్ చేశారా?" కామరాజు కంఠం కర్కశంగా ధ్వనించింది.

రమ మరింత గాభరా పడిపోయింది. కామరాజు అవసరమైతే ఎంత కఠినంగానైనా వుండగలడు. "లే...లే...లేదు సార్! వుదయంనించీ చాలా బిజీగా వున్నాను!" అంది రమ.

"ఐ డోంట్ వాంట్ ఎక్స్క్యూజెస్. అంతా స్మూత్‌గా జరగాలి. సేల్స్ ఇంప్రూవ్‌మెంట్ చూపించకపోతే 'కిన్నెర' క్లోజ్ చేస్తారు. అంటే తెలుసుగా! మీకూ, నాకూ వుద్యోగం వూడుతుంది!" అన్నాడు కామరాజు.

"ఐ విల్ అటెండ్ టూ యిట్ ఇనే మినిట్ సార్!" రమ అమెరికన్లని వదిలేసి కౌంటర్ దగ్గరికి పరిగెత్తింది.

"మళ్లీ ఏమయిందేమిటి?" శశికళ అడిగింది.

"మళ్లీ... మళ్లీనా?... ఏముంది? మెకానిక్‌కి ఫోను చెయ్యాలి!" అంది రమ.

"నీ కభ్యంతరం లేకపోతే నేను చూస్తా నమ్మాయ్!" అన్నదో ముసలి కంఠం.

శశికళ కళ్లు విప్పార్చి ఆ ముసలివాణ్ణి చూసింది. "మన పాకెట్‌మార్ రిపేరు చేస్తా డటోయ్!" అంది రమతో లోగొంతుకలో.

నీట్నైన దుస్తులు వేసుకుని, దర్జాగా అటూ యిటూ తిరుగుతున్న ధనవంతులలో బాగా మాసిన బట్టలు వేసుకుని, తెల్లటి గడ్డం చివర చొక్కా మీద వణుకుతుండగా ముందుకి వస్తున్న ఆ విగ్రహం విచిత్రంగా వుంది చూట్టానికి. రమ అతణ్ణి చూసి, "మీరా, తాతయ్యగారూ! ఎప్పుడు వచ్చారండీ! నేను చూడనేలేదు!" అంది.

"నీకు మీ బావ దగ్గర్నుంచి ఫోన్ వచ్చినప్పుడే వచ్చానమ్మా!" అన్నాడా వృద్ధుడు.

"అలాగా! మీకేం కావాలో చెప్పండి. ఒక్క అయిదు నిమిషాల్లో తీసి యిస్తాను!" అంది రమ.

"నాకేం తొందర లేదులే అమ్మాయ్! ముందా రిపేరు సంగతి చూడనీయ్!" అన్నాడు ముసలాయన.

"సారీ, తాతయ్యగారూ! కస్టమర్సుతో పని చేయించుకోవడం..."

"ఫరవాలేదులే, అమ్మాయ్! ఒక్క క్షణంలో సరిచేస్తాగా!" అన్నాడతడు.

"యీ ముసిలాడు వదిలేట్టు లేడు! పద, మరి!" అంది శశికళ రమతో, రహస్యంగా.

కుర్రాడి సాయంతో రమ మానెక్విన్‌ని తీసి పక్కకి వుంచింది. ముసలాడు వంగి, టేబిల్‌తో కుస్తీ పడుతున్నాడు. రమ తిరిగి తన సెక్షన్ దగ్గరకి పరుగెత్తుకుంటూ వచ్చింది. అమెరికన్లు ఎంచుకోడం అయింది. వాళ్ల వస్తువులన్నీ జాగ్రత్తగా ప్యాక్ చేసి, బిల్లు వేసి యిచ్చింది. తొమ్మిది వందల యాభై యేడు రూపాయలా పద్దెనిమిది పైసలయింది. అతను వెయ్యి రూపాయలు యిచ్చి "కీప్ ది ఛేంజ్" అన్నాడు.

"సారీ, నో టిప్పింగ్ హియర్!" అంది రమ. పనివాణ్ణి పిలిచి బిల్లూ డబ్బూ శశికళకి పంపించింది.

రమ మాటలకి అతడు ఆశ్చర్యంతో నీలం గుడ్లు పెద్దవి చేసి చూశాడు. "కిన్నెర అంటే ఏమిటి?" అని అడిగింది అమెరికా వనిత.

చెమట పైటకొంగుతో తుడుచుకుంటూ "మా షాపు పేరు!" అంది కాస్తంత విసుగులోచే స్వరంతో.

"అది సరే! దానికేమీ అర్థం లేదా?" అని అడిగిందావిడ.

"ఒక రకమైన ఏంజెల్" అంది రమ.

"అంటే గార్డియన్ ఏంజెలా?"

"ఆఁ! ఆఁ! అలాంటిదే!" అంది రమ ఏమనాలో తెలియక.

ఇంతలో కుర్రాడు చిల్లర పట్టుకొచ్చాడు. చిల్లరా, బిల్లూ వాళ్లకిస్తూ "థాంక్యూ, వెరీమచ్! ప్లీజ్ విజిట్ అవర్ ఎంపోరియం అగైన్" అంది.

"థాంక్యూ! యూ ఆర్ స్వీట్ గర్ల్!" అన్నాడతడు, వెళ్లిపోతూ.

"థాంక్యూ! థాంక్యూ!" అని మిగతా యిద్దరూ నిష్క్రమించారు అతడితోపాటే.

"రెడీ!" అని అరిచాడు టర్న్‌టేబిల్ దగ్గర్నించి ముసిలాడు. ఇంతలో మరో నలుగురు రమ సెక్షన్ దగ్గరకొచ్చారు. 'జస్టే మినిట్' అని వాళ్లతో చెప్పి ముసలాయన దగ్గరికి పరిగెత్తింది.

"చూశావా, అమ్మాయ్! రెడీ అయిపోయింది!" అన్నాడతడు. స్విచ్చి వేస్తే టేబిల్ తిరుగుతోంది. స్విచ్ఛాఫ్ చేసి, కుర్రాడి సాయంతో మానెక్విన్‌ని దానిపై వుంచి మళ్లీ స్విచ్ వేసింది. ఈసారి బొమ్మ వయ్యారంగా, మెల్లగా తిరుగుతోంది.

"థాంక్యూ వెరీమచ్ తాతయ్యగారూ!" అంది రమ.

మైలపట్టిన చేతులు పంటుకు రాసుకుంటూ "ప్రాణమున్న ఆడబొమ్మల్ని ఆడించడం మగవాళ్లకి సరదా! ప్రాణం లేని ఆడబొమ్మల్ని ఆడించడంకూడా సరదాయే!" అన్నాడాయన. రమ నవ్వింది

"నువ్వు కాస్త జాగ్రత్తగా వుండమ్మాయ్! లేకుంటే మీ బావ కూడా నిన్ను యిలాగే ఆడించగలడు!" అన్నాడు. రమ చురచురా అతడివంకకి చూసింది.

"సర్దుకన్నా నమ్మాయ్! కోపం తెచ్చుకోకు!" అన్నాడు ముసలాయన నవ్వుతూ.

రమ మెల్లిగా నవ్వింది. "లేదండీ, తాతయ్యగారూ! పెద్దవారు మీరు! హాస్య మాడినంత మాత్రాన కోపం ఎందుకు? పైగా మీరు ఇవ్వాళ నా కింత సాయం చేశారు: కాబట్టి యీ రోజు మీకు స్పెషల్ డిస్కౌంటు యిస్తాను. టెన్ పర్సెంట్ ఆఫ్! ఉండండి, కుర్రాడితో మిమ్మల్ని టాయ్స్ సెక్షన్‌కి తీసికెళ్లమంటాను. మీరు చూస్తూవుండండి! నేను వాళ్లని అటెండ్ అయి వస్తాను. నేను వచ్చేంతవరకూ ఏమీ కొనకండేం!" అని, కుర్రాణ్ణి పిలిచింది.

"ఒద్దులేమ్మాయ్! నేను ప్రతి నెలా వచ్చేవాణ్ణే కదా! నాకు కొత్తేం వుంది? పైగా నీకోసం అది రిపేరు చేశాను. నా బడ్జెట్టు మామూలే. యాభై రూపాయలు. నాకేం డిస్కౌంటు వద్దు!... నువ్వు వచ్చేవరకూ అక్కడే వుంటాను!" అన్నాడు ముసలాయన. వెనక్కి తిరిగి రమని చూసి, చిరునవ్వు నవ్వేసి, మెట్లవేపు నడిచాడు.

రమ తన సెక్షనువేపు గబగబా నడిచింది. కౌంటరు దగ్గర పని లేకపోవడంతో శశికళ రమ సెక్షను దగ్గరకొచ్చి, కస్టమర్సుకు వాళ్లకి కావలసిన వస్తువులు చూపిస్తోంది.

"రక్షించావు తల్లీ!" అంది రమ.

"ఏమంటున్నాడేమిటి మీ ముసలినేస్తం?" అనడిగింది శశికళ.

"మామూలే! ఏదో తేరగా! బొమ్మలు కొనుక్కెళ్లడానికి వచ్చాడు! ఎవరికిస్తాడో ఆ బొమ్మల్ని?" అంది రమ

ముఖం అసహ్యంగా పెడుతూ అంది శశికళ, "ఎవరికిస్తాడో ఏమో! మాసిన బట్టలు వేసుకుని, మన షాపులోకి వస్తుంటే, యిలాటి కస్టమర్సు చూసి నాకే సిగ్గు వేస్తుంది ఎక్కడో పాకెట్‌మార్ చేస్తాడు, బొమ్మలు కొనుక్కెళ్తాడులావుంది!"

"ఛ ఛ! అలాగనుకోను!" అంది రమ.

"నువ్వంతేలే! నీ ఫ్రెండుగామరి!" అంది శశికళ. ముసలాయన వచ్చినప్పుడల్లా యీ సంభాషణ సాగుతూనే వుంటుంది వాళ్లిద్దరిమధ్యా.

టర్న్‌టేబిలుమీద ఆడబొమ్మ మెల్లగా తిరుగుతున్నట్టు ఆమె మనసు మెల్లగా గతంవేపు తిరిగింది. వ్యాపారం పెంచడం కోసం వున్న వూరు విశాఖపట్నాన్ని వదిలి నాన్న హైదరాబాదుకు మకాం ఎత్తేశాడు. పుట్టి పెరిగిన వూరుని వదిలివెళ్తుంటే రమకి కన్నీళ్లు ఆగలేదు. తర్వాత్తర్వాత హైదరాబాదు వాతావరణానికి అలవాటయిపోయింది. చిన్నతనంలో నయితే బావకి వారాని కొక ఉత్తరం వ్రాసేది. అత్తయ్యావాళ్లు విశాఖలోనే వుండిపోయారు. నాన్నగారికి వ్యాపారంలో నష్టం రావడమూ, ఆయన గుండెపోటుతో ఆకస్మాత్తుగా పోవడమూ, కొంపా గోడూ అమ్మి తలకొక దారిగా విడిపోవడమూ — అదంతా ఒక పీడకల. పెద్దన్నయ్య ఏదో వుద్యోగంలో వున్నాడు. అమ్మని తీసికెళ్తూ తననికూడా రమ్మన్నాడు. తనకే వాడితో వెళ్లడానికి యిష్టం లేకపోయింది. నాన్నగారుండగా సరదాకని 'కిన్నెర' చేతిపనుల షాపులో చేరిన వుద్యోగం, ఇప్పుడు తనకి ఆధారమైంది. వర్కింగ్ వుమన్స్ హాస్టల్లో వుంటూ కాలం గడిపింది.

తనకి విశాఖపట్నానికి బదిలీ అయిందని తెలియగానే, రమకి సంతోషమూ దుఃఖమూ కలిగాయి. తమది పెద్ద వ్యవస్థ. దేశం మొత్తం మీద లెక్కలేనన్ని షాపులున్నాయి. ఆంధ్రలోనయితే హైదరాబాదు, ఖమ్మం, కాకినాడ, అనంతపురం, విశాఖపట్నాలలో బ్రాంచిలున్నాయి. హైదరాబాదులో వున్నంతకాలం, ఒంటరిగా వుండినా, మంచిర్యాలలో పనిచేస్తున్న అన్నయ్యకీ, తన దగ్గరున్న అమ్మకీ దగ్గరగా వున్నాననే భావం వుండేది. కాని యిప్పుడు విశాఖపట్టణం వెళ్లాలనేసరికి, తన వాళ్లందరికీ దూరమైపోతున్నానన్న దుఃఖం ముంచుకొచ్చింది. అయితే అందులోనే ఒక సంతోషం. చిన్నప్పుడు పుట్టి పెరిగిన వూరికి వెళ్తున్నాననే ఆనందం. చిన్నప్పటినుంచీ చూడని అత్తయ్యనీ, బావనీ చూడొచ్చని సంతోషం, అందుకే 'కావాలంటే ఖమ్మంకి బదిలీ చేస్తాం' అని ఆఫీసువాళ్లు అన్నా, వద్దని విశాఖపట్టణానికే వచ్చేసింది. అన్నయ్య వుద్యోగం మానేసి యింటికి వచ్చెయ్యమని బతిమాలుకున్నా వినక మొండికెత్తి విశాఖకి వచ్చింది. వాల్తేరులో రైలు దిగి రిక్షా దగ్గరకు వచ్చింది. ఆశ్చర్యంతో ఆమె కళ్లు విప్పారాయి. మత్తుగా, ఎక్కువ జనసంచారం లేని వాల్తేరు ఇప్పుడు కళకళలాడుతోంది. కొత్త కొత్త రోడ్లు, వినూతనమైన కట్టడాలు. 'ఇది తను ఎరిగిన వాల్తేరేనా?' అని విస్తుపోయింది. పర్సులో అన్నయ్య దగ్గర తీసుకున్న అత్తయ్యావాళ్ళ అడ్రసు తీసి రిక్షావాడికి చెప్పింది. రిక్షాలో వెళ్తూ ఆశ్చర్యంగా వూరంతా పరికించింది.

"ఇటు కాదోయ్! కె. జి. హెచ్. డౌనుకి!" అంది రిక్షావాడితో.

"ఇదేనండీ కేజీ డౌను!" అన్నాడు రిక్షావాడు. ఊరెంతో మారిపోయిందని గుర్తించింది.

(31 వ పేజీ చూడండి)

# * సినిమా విశేషాలు *



***శ్రీధర్ పెరిగాడు !***

"ముత్యాలముగ్గు" చిత్రం శ్రీధర్‌కు మొదటి విజయాన్ని తెచ్చింది. "అమెరికా అమ్మాయి" రెండవ విజయాన్ని యిచ్చింది. విశ్వభారతి వారి "తరం మారింది" తృతీయ విజయాన్ని ఇవ్వడానికి సిద్ధంగా వుంది.

ఇప్పుడు శ్రీధర్ అందరివాడయ్యాడు. ప్రముఖ సంస్థలు, విఖ్యాత దర్శకులు శ్రీధర్‌ను పిలుస్తున్నారు. పెద్దల పిలుపును అందుకుంటూ, పెరిగే అవకాశాల్ని పెంచుకుంటున్నాడు శ్రీధర్.

ప్రముఖ దర్శకులు బాపు, శ్రీధర్, మధుసూదనరావుగార్లు శ్రీధర్‌కు ప్రాధాన్యత వున్న పాత్రలను యిస్తున్నారు.

పెరుగుతున్న శ్రీధర్ యింకా పెరగాలి అని యీ కలం ఆకాంక్షిస్తుంది. సినిమాలకు అవసరమైన విగ్రహం, వాయిస్, టాలెంట్ శ్రీధర్‌కువున్నాయి.

**దేవదాసు మళ్లీ పుట్టాడు**

"శరత్" రచించిన దేవదాసును గుల్జార్ హిందీలో నిర్మిస్తున్న నిజం పాఠకులకు తెలుసు.

తెలుగు చిత్రరంగంలో విప్లవాత్మకమైన మార్పును తెచ్చిన ప్రజా దర్శకుడు దాసరి సరికొత్త దేవదాసును సృష్టించారు.

గడుసరి తీర్చిదిద్దిన దేవదాసు తాగడు. పిరికివాడివలె ప్రవర్తించడు. ప్రేమించిన పడతికు అన్యాయం చెయ్యడు.

ఆ దేవదాసు సాధించలేనిదాన్ని, దాసరిగారి దేవదాసు అనుభవిస్తాడు.

రాయదుర్గం పాండురంగప్ప, శ్రీనివాసులు ఈస్ట్‌మన్ కలర్‌లో నిర్మించబోయే "దేవదాసు మళ్లీ పుట్టాడు" చిత్రం జూలైలో ప్రారంభం కాగలదని తెలిసింది.

అక్కినేని నాయకుడుగా, దాసరి దర్శకుడుగా కలిసి పని చెయ్యనున్న మొదటి చిత్రంకూడా యిదే అవుతుంది.

***మార్గ దర్శకుడు !***

తెలుగు సినిమా రంగంలో సంచలనాత్మకమైన మార్పును తెచ్చిన దర్శకుడు ఎవరు ? మన దాసరిగారే. ఆయన సృష్టించిన "స్వర్గం...నరకం" చిత్రం తెలుగు చిత్ర చరిత్రలో చెరగని స్థానాన్ని ఆక్రమించింది.

ఒక దర్శకుడి పేరు టైటిల్స్‌లో కనపడితే ప్రేక్షకులు హర్షధ్వనులతో అప్రీషియేట్ చెయ్యడం ఒక్క దాసరికి మాత్రమే లభించింది.

ఆయన ఎప్పుడూ కష్టజీవే. వృత్తిని దైవంగా పరిగణించే ఆయన్ను అవకాశవాదుల ప్రచారం ఏమీ చెయ్యలేదు.

దాసరి నుంచి మరెన్నో మంచి చిత్రాలను యీ కలం ఎదురు చూస్తుంది. ధైర్యంగా చెయ్యగల దర్శకుడు కూడా ఆయనే.

"తూర్పు ... పడమర" చిత్రం విజయం పొందడానికి దాసరిగారి దర్శకత్వం మొదటి కారణం. ఆయన రచనా వైభవం మరొక కారణం.

***దాసరి చిత్రాలు***

"గడుసరి" దర్శకత్వం నిర్వహించే చిత్రాలు యెలా వుంటాయో, యీ విలేఖరి వూహించి వ్రాస్తున్నాడు.

రవి శంకర్ పిక్చర్స్ వారి "బంగారక్క" చిత్రం నవ్వించే, మానసోల్లాసాన్ని కల్గించే చిత్రంగా వుంటుంది.

శ్రీ లలితా మూవీస్ వారి "ఇదెక్కడి న్యాయం" చిత్రం మహిళాలోకాన్ని ఆకర్షించే చిత్రంగా వుంటుంది.

బాబ్ అండ్ బాబ్ కంబైన్స్ వారి "ఓ మనిషి తిరిగి చూడు" చిత్రం మరొక మంచి చిత్రంగా వుంటుంది.

సరిగమ ఆర్ట్స్ వారి "కన్య ... కుమారి" చిత్రం మరొక "స్వర్గం ... నరకం" వలె సంచలనాన్ని సృష్టిస్తుంది.

"దేవదాసు మళ్లీ పుట్టాడు" చిత్రం మళ్లీ మళ్లీ చూడాలనిపించే చిత్రంగా వుంటుంది.

★—()—★—()—★—()—★—()—★—()—★—()—()—★



'యవ్వనం మురిపించింది'లో జయచిత్ర, శ్రీప్రియ—★—[]



★-()-★-()-★-()-★-()-★- 'దాన వీర శూర కర్ణ'లో -()-★-()-★-()-★-()-★-()-★-()-★-()-★-()-★-()-★-()-★-()-★-()

## అన్నీ ఫస్టులే !

లక్ష్మి ఫిలింస్ కంబైన్స్ కలర్‌లో నిర్మించిన "చక్రధారి" చిత్రాన్ని, స్థానిక సుభాషిణీ థియేటర్లో పలువురితోబాటు, యీ విలేఖరికూడా చూశాడు.

ఇటీవల అర్ధదశాబ్దంలో యింత నీట్ పిక్చర్ రాలేదనిపించింది. టైటిల్స్ దగ్గర్నుంచి శుభం వరకు ప్రతి అడుగు ఉత్సాహకరంగా, ఉత్తేజ భరితంగా వుండడానికి కారణం "టీమ్ స్పిరిట్" అన్న నిజాన్ని అందరూ అంగీకరించగలరు.

చిత్రంలో ఎవరు ఫస్టు,ఎవరు నెక్స్టు అనెడి సంశయానికి చోటు రానివ్వకుండా "చక్రధారి" లో అన్నీ ఫస్టులే అనెడి భావాన్ని కలిగించింది.

కథానాయకుడు, నాయిక ఎంత బాగా రాణించారో, హాస్యత్రయం అంత బాగా చిత్రాన్ని రక్తికట్టించారు. రుక్మిణి కృష్ణులు చూడముచ్చటగా వున్నారు.

"చక్రధారి" చిత్రాన్ని దర్శకుడి చిత్రం అని ఘంటాపథంగా చెప్పే శక్తి, ధైర్యం యీ కలానికి వుంది. పదమూడువేల ఆరువందల అడుగుల చిత్రంలో ఒక్క అడుగయినా వేస్టు లేదంటే, అది దర్శక ... ఎడిటర్ల చాకచక్యమనే చెప్పాలి.

సంగీతాన్ని సమకూర్చిన వెంకటేష్‌ను, సాహిత్యాన్ని సమకూర్చిన ఆత్రేయను "సమవుజ్జీలు" అనక తప్పదు. సెల్వరాజ్ యీజ్ సుపర్బ్.

చిరంజీవి రామకృష్ణకు (ప్లేబాక్) యీ చిత్రం మహోజ్వలమైన భవిష్యత్తును ఇవ్వగలదు. తెరపై అక్కినేని పాడుతుంటే, ఘంటసాల యీ చిత్రానికై దిగివచ్చాడా అనిపించింది.

"చక్రధారి" చిత్రంలో అక్కినేని అద్భుతంగా చేశారని కొందరు, వాణిశ్రీ అద్వితీయంగా చేశారని మరికొందరు వాదించారు, ఆరోజున. "నువ్వా ... నేనా" అని పోటీపడి "మనిద్దరం ఒక్కటే" అని ఋజువు చేశారు.

ఒక మంచి చిత్రాన్ని, ఒక కళాత్మక చిత్రాన్ని, ఒక కమర్షియల్ చిత్రాన్ని, ఒక అవార్డు చిత్రాన్ని నిర్మించిన అనూరాధాదేవిని ఎంతేని అభినందించాలి. చిత్రం గూర్చి యింత గొప్పగా వ్రాయడానికి కారణం : "అనుభూతి."

పూర్ణా పిక్చర్స్‌కు, కృష్ణవేణిగారికి, దర్శకునికి, సంగీత దర్శకునికి, హీరో హీరోయిన్లకు, రచయితకు యెనలేని పేరు ప్రతిష్టలను "చక్రధారి" తెచ్చిపెట్టగలదు.

ఆడవాళ్లు గ్రామాలనుంచి బండ్లు కట్టుకుని వచ్చి అనాటి "లవకుశ" వలె "చక్రధారి"ని ఆదరించగలరన్న ఆశ ... నమ్మకం వున్న వాళ్ళలో నేను ఒకడ్ని.



★[]-★-[]-★-'అన్నా చెల్లెలు'లో విజయవాణి, రత్నాంజలి

# సినిమా

### ఊహించని నిజం !

ప్రముఖ చిత్ర నిర్మాత శ్రీ దుక్కిపాటి మధుసూదనరావుగారు 53 రోజుల్లో 'ప్రేమలేఖలు' చిత్రాన్ని పూర్తిచేశారన్న వార్తను ఊహించని నిజంగా పేర్కొనవచ్చు.

అన్నపూర్ణా పిక్చర్స్ వెలసి ఇరవై అయిదేండ్లు పూర్తయిన శుభతరుణాన, "ప్రేమలేఖలు' చిత్రం అక్టోబర్ రెండున ప్రారంభమైంది. వరుసగా 53 రోజులు స్టుడియో ప్రమేయం లేకుండా షూటింగు జరగడంకూడా యిదే ప్రథమం.

ప్రముఖ నవలా రచయిత్రి సులోచనారాణిగారు వ్రాసిన లొకేషన్లను, చిత్రంలో అక్కడికే వెళ్లి చిత్రీకరించారు.

ఈమధ్య మధుసూదనరావుగారు పత్రికా సమావేశాన్ని వారి మద్రాసు ఆఫీసులో ఏర్పాటు చేసినప్పుడు, చిత్ర వివరాలను వెల్లడిస్తూ' అనంతనాగ్ ప్రతిభను ప్రశంసించారు.

నవలను అలాగే ఫాలో అయినట్టు, మధుసూదనరావుగారు చెప్పారు. 'రచయిత్రి సృష్టించిన పాత్రలకు ఎవరు సరిపోతారో, అట్టివారినే ఎంపిక చేసినట్టు, దుక్కిపాటిగారు చెప్పారు.

"ప్రేమలేఖలు" చిత్రానికి కె. రాఘవేంద్రరావు దర్శకుడు. సత్యానంద్ సంభాషణలను, సత్యం సంగీతాన్ని సమకూర్చారు. విన్సెంట్ డైరెక్టర్ ఆఫ్ ఫొటోగ్రఫీ.

ప్రధాన పాత్రలను జయసుధ, దీప, శుభ, పుష్పలత, మురళీమోహన్, అనంతనాగ్, గిరిబాబు, సత్యనారాయణ, అల్లురామలింగయ్య మరియు జగ్గయ్య పోషించారు.

రాబోయే నెలలో డబ్బింగు వర్కు పూర్తి కాగలదని, కొన్త గ్యాపు చూచి చిత్రాన్ని విడుదల చెయ్యగలరని, అన్నపూర్ణా పిక్చర్స్ అధినేత పత్రికల వారికి తెలిపారు. నవయుగ విడుదల.

### అగ్రనటి చిత్రాలు ఎన్ని ?

"నెంబర్‌వన్" గా ప్రజలచేత కీర్తింపబడుతున్న వాణిశ్రీ—వొప్పుకుంటే ఎన్ని చిత్రాలైనా చెయ్యడానికి నిర్మాతలు "రెడీ" గా వున్నారు. కానీ, ఆమె చిత్రాల సంఖ్యను పరిమితం చేసుకుని రెండేడ్లు దాటింది. సంవత్సరానికి అయిదారు చిత్రాలు మాత్రమే అంగీకరిస్తుంది.

ఇప్పుడామె నటిస్తున్న చిత్రాలు. అక్కినేని గారితో రెండు, నందమూరిగారితో రెండు, శివాజీతో రెండు, కృష్ణంరాజుగారితో ఒకటి, కృష్ణగారితో ఒకటి.

అక్కినేనితో "చక్రధారి, ఆలుమగలు" చిత్రాలు. (రెండూ విడుదలకు సిద్ధంగా వున్నాయి.) నందమూరితో ఇందిరా మూవీస్ వారి చిత్రం. (మార్చిలో ప్రారంభం.) కృష్ణతో "జన్మ జన్మల బంధం" (పూర్తయింది.) కృష్ణంరాజుతో మారుతీ కంబైన్స్ వారి "జీవనరాగం" (రెండు షెడ్యూల్సు జరిగాయి.) శివాజీతో "మదర్ ఇండియా, ఇలయ తలముగై" చిత్రాలు. ఈ చిత్రాలన్నీ కలర్ గావడం గమనించదగ్గ విషయం.

కొత్త సంవత్సరంలో నాల్గయిదు చిత్రాలకు "అగ్రనటి" అంగీకారాన్ని తెలిపింది.

### శ్యాంబెనగల్ చిత్రం ఎప్పుడు ప్రారంభం

రవిరాజ్ యింటర్నేషనల్ తలపెట్టిన ప్రయోగాత్మక చిత్రం డిశంబర్ 15 న ప్రారంభం అయ్యుంటే, యీ సంచిక మీరు చదివే టైముకు పూర్తయ్యుండేది.

"అవార్డుల దర్శకుడు" బెనగళ్ స్క్రిప్టును యీ నెల (డిశంబర్ ఆఖరివారం) వోకే చేసి, ముఖ్య పాత్రధారులను ఎంపిక చెయ్యడం జరిగింది.

జనవరి 15 నుంచి షూటింగు "నాన్ స్టాప్"గా జరుగగలదని, నిర్మాత కేశన జయరావ్ చెప్పారు.

తెలుగు చిత్రాలలో వాణిశ్రీగారు చెయ్యని పాత్ర, రాణించని పాత్ర లేదంటే అతిశయోక్తి కాదు. అట్టి అద్వితీయ నటికి, శ్యాంబెనగళ్‌గారు అనూహ్యమైన పాత్రను సృష్టించారు.

ముందెన్నడు ఆమె ధరించని "రియలిస్టిక్ క్యారెక్టర్"ను ఆమె పోషించబోతున్నదని, మరొక నిర్మాత వెంకట్రామిరెడ్డి చెప్పారు.

ఈ సంచలన చిత్రానికి ఆరుద్ర రచనాకర్తగా వ్యవహరిస్తున్నారు.

# మీ పిల్లలకు అవసరం పుష్టికరమైన ఆహారం
# మీ పైర్లకు అవసరం విజయ్

పిల్లలు ఆరోగ్యంగా వుండాలంటే పుష్టికరమైన ఆహారాన్నివ్వాలి. అట్లాగే పైరు మొక్కలకు నత్రజని, భాస్వరం, పొటాష్‌లతో కూడిన పోషక పదార్థాలు అందజేయాలి. అప్పుడే పంటదిగుబడులు బాగుంటాయి, రాలుబడి ఎక్కువౌతుందికూడా.

ప్రస్తుతం ఎరువుల ధరలు పెరిగిపోయిన మాట వాస్తవమే. అందుచేత ఖర్చులు తగ్గించుకోడానికి వరిపైరుకు యూరియా మాత్రమేవేస్తే సరిపోదాఅని మీలో కొందరు అనుకోవచ్చు. కాని యూరియా మాత్రమే వేస్తే...వరి మొక్కలలో చీడలు, తెగుళ్ళ నిరోధక శక్తి తగ్గిపోతుంది. అంతేకాదు పైరు నీటి ఎద్దడిని తట్టుకునే శక్తినికూడా కోల్పోతుంది. భూసారం కూడా క్రమేణా తగ్గి పంటదిగుబడులు క్షీణించిపోతాయి.

భాస్వరం, పొటాష్‌లు వాడినపుడే మొక్కలు నత్రజనిని గ్రహించుకోగలుగుతాయి. ఈ మూడు పోషక పదార్థాలు వాడితే పైరు మొక్కలు బాగా ఎదిగి, అధికరాలుబడి, అధిక లాభాలు వస్తాయి. ఈ విషయాన్ని ఋజువుచేసిన పరిశోధనా ఫలితాలను పరిశీలించండి.

## వరిపంట

| వేసిన పోషక పదార్థాలు | ఎకరాకు దిగుబడి (75 కిలోల బస్తాలు) | ఎకరాకయ్యే సాగుబడి ఖర్చు రూ. | ఎకరాకు రాబడి రూ. |
|---|---|---|---|
| 50 కిలోల నత్రజని | 20 | 1080 | 1200 |
| 50 కిలోల నత్రజని + 25 కిలోల భాస్వరం | 29 | 1255 | 1740 |
| 50 కిలోల నత్రజని + 25 కిలోల భాస్వరం + 25 కిలోల పొటాష్ | 32 | 1300 | 1920 |

పై వివరాలనుబట్టి చూస్తే నత్రజనితోపాటు వరి పైరుకు భాస్వరం పొటాష్‌లను కూడా వేయడంవల్ల అదనంగా అయ్యే ఖర్చు ఎకరాకు రూ. 220/-. అయితే దీనివల్లవచ్చే రాబడి ఒక నత్రజనిని మాత్రమేవేస్తే వచ్చిన రాబడికన్నా రూ. 720/- ఎక్కువ. ఇదే విధంగా యితర పైర్లకు కూడా విజయ్ 17-17-17 వాడినట్లయితే అధిక దిగుబడి అధిక లాభాలు పొందవచ్చు. విజయ్ 17-17-17లో నత్రజని, భాస్వరం, పొటాష్ పోషక పదార్థాలు సమపాళ్లలో వున్నాయి.

పొటాష్ ఎక్కువగావున్న భూములకు అనువైన ఎరువు విజయ్ 24-24-0. విజయ్ కాంప్లెక్స్‌లతో బాటు పైరుమీద చల్లడానికి విజయ్ యూరియా చాలా అనువైనది.

విజయ్ ఎరువులను వాడండి—అధిక లాభాలను పొందండి.




విపులంగా తెలుసుకోవాలంటే
యీక్రింది చిరునామాకు వ్రాయండి.
ఏరియా మేనేజర్
మద్రాస్ ఫర్టిలైజర్స్ లిమిటెడ్
44, శాంతినగర్ కాలనీ, హైదరాబాద్-500 028






MFL-1162











'ముత్యాల పల్లకీ'లో ఒక దృశ్యం

# సినిమా

## తమ్మారెడ్డికి కథ రెడీ

మంచి చిత్రాలను, కమర్షియల్ చిత్రాలను అందించిన రవీంద్ర ఆర్ట్ పిక్చర్స్‌కు ప్రజల్లో విలువ మాసిపోదు అని "అమ్మ—నాన్న" చిత్రం ప్రూవ్ చేసింది.

అభ్యుదయ భావాలు, పరిశీలనాత్మక శక్తి తమ్మారెడ్డిగారికి వున్నాయిగనకనే, మంచి చిత్రాలు వచ్చాయి.

జనవరి మొదటి వారంలో తమ్మారెడ్డిగారిని, సంగీత దర్శకుడు చలపతిరావుగారింట కలిశాను.

అక్కినేనిగారికి కథ రెడీ అని చెప్పి, కథను హీరో విని "యస్" అన్నట్టుకూడా వెల్లడించారు.

1977 చివరి భాగంలో అక్కినేనిగారి చిత్రం అన్నపూర్ణా స్టుడియోస్‌లో ప్రారంభం అవుతుందని చెప్పి, దర్శకత్వాన్ని పాపులర్ వ్యక్తి నిర్వహించగలరని వ్యక్తపరచారు.

## అక్కినేని ... జయమాలిని పోటీ నృత్యం

జయమాలిని నృత్యంలో సిద్ధహస్తురాలు. ఆవిడ పాద భంగిమలకు అచ్చెరవు అందనివారు అరుదు. ఆమెతో పోటీపడి నెగ్గినవారు అరుదు.

ఒక నృత్య సభలో ఆమె తనతో పోటీ చెయ్యగల ధీరులెవరయినా వున్నారా అని ప్రశ్నించింది. అందరూ తెల్లముఖం వేశారు.

'నేనున్నాను' అంటూ ఒక మధ్యవయస్కుడు ఆమెతో "సై" అన్నాడు. జయమాలిని ఆట కట్టించాడు. ఆమెను సునాయాసంగా జయించి, కనువిప్పు కలిగించాడు.

ఈ రసవత్తరమైన నృత్య దృశ్యం ప్రసాద్ ఆర్ట్ పిక్చర్స్‌వారి "అలుమగలు" వర్ణచిత్రంలో ప్రత్యేక ఆకర్షణగా వుంటుంది. శ్రీ ఎ. వి. సుబ్బారావు నిర్మిస్తున్న "అలుమగలు" చిత్రానికి తాతినేని రామారావు దర్శకుడు.

"ఆలుమగలు"గా నటిస్తున్న అక్కినేని, వాణిశ్రీ నటనలో యిద్దరు యిద్దరే అనిపిస్తున్నారు. అక్కినేనిగారి శృంగార దృశ్యాలు, వాణిశ్రీగారి చిలిపి దృశ్యాలు, నాగభూషణంగారి విదూషక దృశ్యాలు, రాజబాబు హాస్య సన్నివేశాలు ప్రేక్షకులకు పూర్ణాహారాన్ని యివ్వగలవు.

ఈ చిత్రంలో రోజారమణి, రాజకుమారి, నారాయణరావు, లక్ష్మీకాంత్, విజయలలిత సహాయ పాత్రలను, గుమ్మడి గెస్టు పాత్రను పోషించారు.

తాతినేని చలపతిరావుగారు "ఆలుమగలు" చిత్రం తాలుకు పాటలను వినిపించినప్పుడు, అన్నీ బావున్నాయి అని అనాలనిపించింది. ఆరు పాటలున్నాయి. ప్రతి పాటలో ఏదేని కొత్త గిలిగింత తేవడంలో చలపతిరావు జయించారు.

ఈ కుటుంబగాథా చిత్రానికి బాలమురుగన్ కథను, ఆత్రేయ మాటలను సమకూర్చారు. నవయుగ పంపిణీదారులు.

— శ్రీనివాస్

'సావాసగాళ్లు'లో ఒక సన్నివేశం



తర్వాత తనకి తెలిసిన ప్రదేశాలన్నీ చూసి, ఇది తనకు తెలిసిన పట్నం కాదని గమనించింది. టౌనుహాలు దగ్గర చిందులేస్తూ కేరింతాలుకొట్టే సముద్రపుటల లేవీ? తనకి బాగా గుర్తున్న వీధులేనా యివి? తను చదువుకున్న క్వీన్‌మేరీస్ మాత్రం మారలేదు. అసలు పాత పోస్టాఫీసు నుంచి, హిందూ రీడింగు రూం వరకూ ఏమీ మారలేదు. ఆ తరవాతదిమాత్రం, తనకు తెలిసిన వూరు కాదు. అదొక నూతన నగరం. నాగరికత సృష్టించిన కొత్త ప్రపంచం. వీటన్నిటిమీదా ఇనుప నాగులాగా చుట్టుకుంటూ హార్బరులోకి వెళ్ళే ఇనుప ఖనిజపు కన్వేయరు.

అత్తయ్యా వాళ్ళింట్లో తను రెండురోజు లుంది. బి. ఇ. అయినా బావకి వుద్యోగం లేకపోవడం, చిన్న చిన్న వుద్యోగాలు చెయ్యడం బావకి యిష్టం లేకపోవడం, వాళ్ళింట్లో యిబ్బందులు — రమకి బాధని కల్గించాయి. బావని పెళ్లి చేసుకుని, హాయిగా తన యింటిని చక్కబెడుతూ కూర్చోవాలనే భావం కలగకపోలేదు. కానీ, స్వంత వ్యాపారం చేసి, ఉన్నతస్థితికి వచ్చాక గాని, పెళ్లి మాటలు తలపెట్టేది లేదని బావ ఏదో మాటల సందర్భంలో అన్నది విని, తన అభిప్రాయం మార్చుకుంది. బావ సాయంతో వర్కింగ్ ఉమెన్స్ హాస్టలులో సీటు సంపాదించి దానిలో చేరిపోయింది, అత్తయ్య వద్దంటున్నా వినకుండా. అయితే రోజుకి రెండుసార్లయినా బావ ఫోను చేస్తుంటాడు. అప్పుడప్పుడూ కలిసి రామకృష్ణా బీచి దగ్గరకి షికార్లకి వెళ్తుంటారు. పది పదిహేను రోజులకోసారి పళ్లు తీసుకొని, అత్తయ్యావాళ్లింటికి వెళ్తుంటుంది. ఆ రోజు రాత్రికి అక్కడే భోంచేసి, హాస్టలుకి తిరిగి వస్తుంటుంది.

తను చేరిన రెండోరోజునే షాపులో 'పాకెట్ మార్' అనే ముద్దు పేరు పెట్టిన ముసలాయన్ని చూసింది. మాసిన బట్టలతో జంకూగొంకూ లేకుండా, షాపులోకి వస్తున్న అతణ్ణి చూసి, తను భయపడింది. గబగబా అతడి దగ్గర కెళ్లి "చూడండి! ఇది చేతి పని వస్తువులు అమ్మే దుకాణం! మీకు కావలసినవి ఏవీ యిక్కడ దొరకవు!" అంది.

"నాకు బొమ్మలు కావాలి. ఆటబొమ్మలు!" అన్నాడతను.

"దొరుకుతాయికానీ చాలా ఖరీదు!" 'వా'ని దీర్ఘంతీస్తూ అంది. ముసలాయన నవ్వాడు. "నువ్వు కొత్తగా వచ్చావా అమ్మాయ్!" అని అడిగాడు.

"అవు" నన్నది.

"నాదగ్గిర యాభై రూపాయలు వున్నాయ్!" అన్నాడతను జేబులో చెయ్యి పెట్టుకుంటూ.

తనే మనలేక వెనక్కితిరిగి వచ్చేసింది. తర్వాత తెలిసింది, అతడు ప్రతినెలా వచ్చి బొమ్మలు కొనుక్కొని వెళ్తుంటాడని. చూడడానికి పేదవాడు లాగా కనిపించే అతను ప్రతినెలా యాభయి రూపాయల ఆటబొమ్మలు - చాలా ఖరీదయిన బొమ్మలు — కొనుక్కెళ్లడం రమకి విచిత్రంగా కనిపించింది.



ఢిల్లీలో జరిగిన 6వ అంతర్జాతీయ చలన చిత్రోత్సవంలో పాల్గొన్న బ్రిటిష్ చిత్రం బ్యారీ లిండన్‌లో ఒక దృశ్యం

## కీన్నెర

(25 వ పేజీ తరువాయి)

ఎవరో ఏదో అడుగుతున్నారు.

"ఏమిటండీ?" అనడిగింది రమ, వర్తమాన పరిజ్ఞానం కలిగించుకుని.

అతనడిగిన దానికి "అది ఐవరీ ఇన్‌లే వర్క్ అండీ. చాలా నాణ్యమైంది. చెదరదు" అంది.

"అదికాదండీ, ఇది" అతడు మరో బొమ్మని చూపించాడు.

"గీతోపదేశమండీ! అది ప్యూర్ ఐవరీ. ఇక్కడ తయారైందే!" అన్నది.

"ఖరీ దెంతండీ?"

యాంత్రికంగా జవాబు చెప్పి "తల్లీ, నువ్విక్కడ కాసేవుండు! నేను ఒక్కక్షణంలో వస్తాను!" అని శశికళతో అంది.

"టాయ్స్ డిపార్టుమెంటుకేనా? వెళ్లిరా!" అంది శశికళ.

మెట్లెక్కి గబగబా మేడమీదకి వచ్చి ఆటబొమ్మల విభాగంవేపు నడిచింది. తీరిగ్గా ముసలాయన బొమ్మల్ని పరిశీలిస్తున్నాడు.

"తాతయ్యగారూ! సెలక్షన్ అయిందా?" అని అడిగింది రమ.

"ఏదమ్మా! నువు వస్తానన్నావుగా! అందుకే వూర్కున్నాను" అన్నాడాయన.

త్వర త్వరగా నాలుగైదు బొమ్మల్ని ఏరి, పాక్ చెయ్యమంది. పాక్ చేస్తుంటే "చూడండి, ఈయన మన రెగ్యులర్ కస్టమర్. పది పర్సెంటు వారికి డిస్కౌంటు యివ్వాలి!" అంది సేల్స్‌మెన్ చంద్రంతో.

"సారీ! అవి లేటెస్టు స్టాకు. దానిపై డిస్కవుంటు కుదరదు!" అన్నాడు చంద్రం.

రమ ముఖం ఎర్రబడింది. "ఎందుకు కుదరదు? ... పైగా ఆయన మనకి ఇవేళ చేసిన సహాయం తెలుసుకుంటే..." మాటలు కోపంలో తడబడ్డాయి.

"ఆ విషయం మీరు మేనేజరుగారితో మాటాడండి. ఆయన ఒప్పుకుంటే నాకే అభ్యంతరమూ లేదు!" అన్నాడు చంద్రం.

ముసలాయన ఆమె దగ్గరగా వచ్చాడు. "కోప్ప డకమ్మాయ్! నాదగ్గర యాభై రూపాయ లుందిగా!" అన్నాడు అనునయంగా చూస్తూ. "ఏదీ బిల్లు యిలాతే!" అని తీసుకుని, బొమ్మల ప్యాకెట్టునుకూడా తీసుకొని, రమతో కలిసి క్రింది కొచ్చాడు.

"వస్తానండీ!" మెట్లు దిగాక నమస్కారం చేసింది రమ.

"నువ్వు బాధపడకమ్మాయ్! నాకు డిస్కవుంటు వద్దని ముందే చెప్పాగా!" అన్నాడతను. ఆమెవేపు చూసి నవ్వి, తల పంకించి, కౌంటరువేపు సాగిపోయాడు.

* * *

కొన్నాళ్ళ తరువాత —

షాపు మూసేశాక, హ్యాండుబాగు తీసుకొని, శశికళకి గుడ్‌బై చెప్పి, అప్‌లాండ్సువేపు నడుచు కుంటూ బయలుదేరింది రమ. కొంతదూరం నడిచాక, ముందు మెల్లగా సాగిపోతున్న ముసలాయన్ని చూసింది. నడక వేగం హెచ్చించి, అతణ్ణి వచ్చి కలుసుకుంది.

"నమస్కారం తాతయ్యగారూ!" అంది.

అతను తలతిప్పి చూసి "ఓ నువ్వా అమ్మా!... ఏమిటి యీరోజు ఏమీ ప్రోగ్రాం లేదా?" అనడిగాడు.

"ఎందుకులేదండి? మా బావ స్కూటర్ తెస్తానన్నాడు. అలా యూనివర్శిటీ వేపు వెళ్లొస్తాం!"

"అబ్బ! స్కూటర్ కొనేశాడేమిటి?"

"లేదండీ! ఎవరో ఫ్రెండు దగ్గర అరువుకి తీసుకొస్తానన్నాడు. వట్టినే సన్నాల తిప్పడానికి!" నవ్వేసింది.

"బాగుందమ్మా!" అన్నాడు ముసలాయన.

"అవునూ! చేతిలో ఏమిటో పాకెట్ పట్టుకున్నారు? బొమ్మలు కాదుగదా!" అనడిగింది.

"అబ్బే! బొమ్మలుకావు తల్లీ! బట్టలు! రేపు నా పుట్టినరోజు. అందుకే ఇంట్లోవాళ్లంతా బలవంతంచేస్తే కొన్నాను!" అన్నాడు, పాకెట్ గాలిలో ఆడించి, రెండోచేతికి మార్చుకుంటూ.

"భేష్! ఇన్నాళ్లకి ఒక మంచిపని చేశారండీ!" అంది రమ.

"ఏం? రేపు నేను కొత్తబట్టలు వేసుకుంటే జపాన్‌లో భూకంపం వస్తుందంటావా?" అని నవ్వాడు. "ఏం చేసేది తల్లీ! అలవాటు! ఎన్నో సంవత్సరాలు మెకానిక్‌గా పని చేశాను. అన్నిరకాల పనులూ నేర్చుకున్నాననుకో. అప్పటి అలవాటు. కొత్తబట్టలు వేసుకుంటే నాకదోలా వుంటుంది!" అన్నాడు.

హటాత్తుగా రమ నేలవంకకి చూసింది. అతడి కాళ్లకి జోళ్లు లేవు. "తాతయ్యగారూ! రేపు పది గంటలకి మీరు షాపుకి ఒకసారి రాగలరా?" అనడిగింది.

"ఎందుకూ?"

"వూరికేనండి! రాగలరా?"

"ఏమిటి? కొత్తబట్టలు వేసుకునేనా?"

"అవునండీ! మిమ్మల్ని ఆ బట్టల్లో చూస్తే

మావాళ్లంతా మురిసిపోతారు. తప్పక రావాలిసుమా!"

ముసలాయన నవ్వాడు. "సరేనమ్మా! నువ్వు చెప్పాక తప్పుతుందా?"

దూరంనించి చప్పట్లు వినిపించాయి. ముసలాయన వెనక్కి తిరిగాడు. రమ కూడా తిరిగింది.

పరుగెత్తుకుంటూ గోపాలం వచ్చాడు. "అబ్బ! ఎంతదూరం నించి మీ వెనక పరుగెత్తుకుంటూ వస్తున్నానో తెలుసా?" అన్నాడు.

"ఎందుకూ పరుగెత్తుకురావడం? స్కూటర్లు వెస్తానన్నావుగా!" అంది రమ.

"వద్దులే రమా! తెద్దామనుకున్నానుగానీ, అరువు సొమ్ము బరువుచేటని తేలేదు!" అన్నాడు గోపాలం.

"బాగా చెప్పావు నాయనా! నువ్వు నాకు నచ్చావు!" అన్నాడు ముసలాయన.

గోపాలం ప్రశ్నార్థకంగా ఆయనవంక చూశాడు ఎవరన్నట్టు. రమ "తాతయ్యగారూ! యీయనే మా బావ గోపాలం! బావా! ఈయనా...మాషాపు కొస్తుంటారు!" అంది ఆయన్నెలా పరిచయం చెయ్యాలో తెలియక.

"పేరేదైతేనేం నాయనా! 'కిన్నెర'లో అంతా నన్ను 'పాకెట్‌మార్' అంటుంటారు" అన్నాడాయన నవ్వుతూ.

"అరే! మీకు తెలుసన్నమాట!" రమలో ఆశ్చర్యం.

అతడు నవ్వుతూ తల పంకించాడు. "కుర్రాడివి గాబట్టి మరదల్ని సరదాగా స్కూటర్‌మీద షికారుకి తీసుకెళ్లాలని అనుకున్నావనుకో. దాంటో తప్పులేదు. కానీ, యీరోజు నువ్వు ఆ స్కూటరే గనక తీసుకొచ్చివుంటే, నీపై నాకు సదభిప్రాయం కలగకపోను!" అన్నాడు.

"అంతేనండి!" అన్నాడు గోపాలం. "నేను స్కూటర్ కొనే రోజు ఎంతోదూరంలో లేదండి! స్కూటరేం ఖర్మ! దేవుడు దయదలిస్తే!... అయితే ఒక్క దెబ్బే వేలు పెట్టుబడి కావాలండి!... ఏ బాంకువాళ్లయినా అంత మదుపు పెట్టడానికి జంకుతున్నారండి!"

"పోనీ! డబ్బు దొరకడం సాధ్యంకానప్పుడు వుద్యోగం చూసుకుంటే పోలా!" అన్నాడు ముసిలాయన.

"అబ్బే! వుద్యోగం అంటే నా కిష్టం లేదండి! బానిసత్వం కాదుటండీ! హాయిగా యిండస్ట్రీ పెట్టుకోవాలండీ!"

"నీ ఊహ బాగానేవుంది నాయినా! కాని ఆధారంలేకుండా కలలుగనడం, నిచ్చెన లేకుండా స్వర్గానికి ఎగ్రబాకడంవంటిదికదా!"

"అదేనండి నా దుగ్ధ. కానీ యీ యిండస్ట్రీ చాలా గొప్పది. ఆరువందలు పెట్టి ప్రోడక్టు, మార్కెటింగు సర్వే చేయించాను. మూడేళ్ళలో అప్పు తీర్చేసి, ఇంతకింతా మిగిలించుకోవచ్చును." కుతూహలంగా అన్నాడు గోపాలం.

చిన్నపిల్లాడిలా, ఉద్వేగంగా మాట్లాడే గోపాలాన్ని ఆదరంగా చూశాడు ముసిలాయన. "నీ కలలు కల్లలు కాకూడదని కోరుకుంటున్నాను నాయనా! కానీ ఆలోచించు.. అందే స్వర్గాన్ని ఆశించడం మేలుగాని..."

"నా శక్తిమీద నాకు నమ్మకం వుందండీ! యింత విశ్వాసాన్ని కాపాడేటందుకైనా ఏ దేవతలో దిగివచ్చి కరుణించకపోరు!" అన్నాడు గోపాలం.

"వెర్రిమొర్రి కలలు!" అని గొణుక్కున్నాడు ముసిలాయన. "సరేనమ్మా! నే వస్తాను! మీరలా వెళ్తారేమో వెళ్లిరండి!" అన్నాడు.

"తాతయ్యగారూ! రేపుదయం షాపుకి రావడం మరువకండి!" అంది రమ.

"అలాగే" నని వెళ్లిపోయాడతడు.

అతడు వెళ్లాక, "ఆయన చెప్పినట్టు ఉద్యోగం చూసుకోరాదూ! డ్రైడాక్‌లో ఏదో వుద్యోగం వున్నదన్నావుగా!" అంది రమ.

"అది యీ జన్మకి సాధ్యపడదు!" అన్నాడు గోపాలం.

"అయితే యిక నేను నీతో రాను ఫో!" అంది రమ.

"అదేం?"

"అదంతే! యీ జన్మాని కింతే!" ముఖం ఎర్రగా చేసుకుని అంది.



గోపాలం నవ్వాడు. "అంత సులభంగా వదుల్తాననుకున్నావా? ఏనాటికైనా నిన్నే పెళ్లి చేసుకునితీరాతనని ఎప్పుడో అనుకున్నాను."

"ముసలిదాన్నయాక పెళ్లి చేసుకుంటావా?" అడిగింది రమ.

"అంత ఆలస్యం కాదనుకుంటా! దేవుడు దయదలిస్తే త్వరలోనే అవుతుంది.'

"చూద్దాం!" అంది రమ, నిర్లిప్తంగా ముందుకి నడుస్తూ

* * *

"ఏమోయ్, శశీ! నీ చేతిచలవ మంచిది. బోణీ చెయ్యవోయ్!" అంటూ రమ కౌంటర్ దగ్గర కొచ్చింది.

ఆరోజు షాపు నిర్మానుష్యంగా వుంది. సేల్స్‌మన్ తమ తమ డిపార్టుమెంటుల్లో షోకేసు అద్దాల్ని తళతళలాడేలా తుడుస్తూ కూర్చున్నారు. కౌంటరు దగ్గర శశి ఇంగ్లీషు నవల తిరగేస్తూంది.

"ఏమిటో విశేషం?" అంది శశి, నవలలోంచి తల పైకెత్తి.

"మన తాతయ్యగారి పుట్టిన రోజట ఈవేళ. పది గంటలకి రమ్మన్నాను. వస్తే ఆయనకి మనమంతా కలసి ఒక చిన్న బహుమతి యివ్వాలని వుద్దేశం!" అంది రమ.

"ఎవరికి మన పాకెట్ మార్‌కేనా?"

"ఛఛ! మాటి మాటికీ అలాగనకు శశీ! ఆయన మనకి కస్టమర్. నెల నెలా మన షాపులోనే కొంటుంటాడు. పైగా పెద్దవాడు ఆయనకో చిన్న ప్రెజెంట్ యిస్తే మునిగేదేముంది?"

"ఏం ప్రజంట్ యిస్తే బావుంటుందబ్బా? ఒక 'టై' కొనిద్దామా?" అనడిగింది పెంకిగా శశికళ.

"ఆయనకి గడ్డం వుందిగా?"

"పోనీ హాండ్‌లూం బనియను కొనిస్తేనో?"

"ఛఛ! అది అంత బావుండదనుకుంటా. అదీగాక ఆయన నిన్న కొత్తబట్టలు కూడా కొనుక్కున్నాడు" అంది రమ.

"గ్రేట్! కొత్తబట్టల్లోనే యిక్కడికి వస్తాడన్నమాట. అయితే తప్పక అతడికి బహుమతి యివ్వాల్సిందేనోయ్!"

"అందుకే మంచి హాండ్‌మేడ్ జోళ్ల జత యిద్దామని వుంది. నువ్వు బోణీ చేస్తే నేను వెళ్లి అందర్నీ అడుగుతా!"

"ఓకే! ఇదుగో నావి రెండు రూపాయలు!"

ఇంతలో ఒక్కొక్కరే కౌంటరు దగ్గర గుమిగూడారు. అంతా విని "మన పాకెట్‌మార్‌కా తీసుకోండి! నావి రెండు" అన్నాడు విక్టర్. అలాగా పద్దెనిమిది రూపాయలు వసూలయింది.

"ఇంక మానేజరొక్కడు మిగిలాడు. ఆయన దగ్గిరికీ వెళ్లొస్తా!" అని బయలుదేరింది రమ.

"వుండవే తల్లీ. 'మై అరైవింగ్'గా డొచ్చాడు!" అంది శశి. అంతా నవ్వారు.

"చచ్చాంరా, భగవంతుడా!" అని స్టూలుమీద కూర్చుంది రమ. రెడ్‌శాండర్స్‌తో చేసిన వస్తువులు టోకున అమ్మడానికి పార్వతీపురం నుంచి ఒక డొస్తుంటాడు. వచ్చినప్పుడల్లా యింగ్లీషులోనే మాట్లాడుతుంటాడు. "మై అరైవింగ్ వెల్క్యువరు మానేజరూ!" అని దీర్ఘాలు తీస్తాడు. "ఐ వరీ వర్కు సార్ ఆల్సో అవేలబుల్. వండర్‌ఫుల్ కేను వర్కు సార్. ఆల్ అవేలబుల్. హౌ మచ్ యూవే? ప్రైస్ సూటబుల్, ఐయామ్ సెల్లింగ్. నాట్ సూటబుల్ ఐయామ్ గోయింగు" అంటూ మానేజరుతో మాట్లాడతాడు. జింకిణీలాగా ఓ పట్టాన మాటలు తెగనివ్వడు. వాడికి వాళ్లంతా ముద్దుగా "మై అరైవింగు" అని పేరు పెట్టారు.

రమ లేచింది. "ఏమయితే అయింది. మానేజరు దగ్గరకు వెళ్తాను" అంది రమ.

"ఓకే. ట్రై యువర్ లక్!" అంది శశి. అంతా భయం భయంగా చూశారు.

రమ మేనేజర్ డోరు దగ్గరకొచ్చి తట్టింది. "కమిన్" అన్నాడు కామరాజు. రమ క్లుప్తంగా వివరించింది తను వచ్చిన పని. ఆ ముసలాయన ఒక రోజు తమ షాపులో చిన్న రిపేరు కూడా చేశాడని చెప్పడం మరవలేదు. కామరాజు నవ్వుతూ "సరే!

# 3 నెలలప్పుడు పాపకు యిచ్చే ఘన ఆహారం మిగతా జీవితపు స్వరూపాన్ని నిర్ణయిస్తుంది;
## కేవలం పాలుయిస్తే చాలదని డాక్టర్ల అభిప్రాయం



**డాక్టర్లు ఫారెక్స్ యివ్వమని సిఫార్సుచేసే కారణం—**
పెరిగే పాప అవసరాలకు కావలసినది దీనిలో ప్రత్యేకంగా సంతులితం చేయబడటం.
ఫారెక్స్‌లో, ఆరోగ్యమైన రక్తమూ, శక్తినీ యిచ్చే యినుము సరియైన ప్రమాణంలో ఉంది— తల్లి పాల నుంచి మార్చేటప్పుడు యిచ్చే ఏ యితర ఆహారంలోనూ యిది యింత సరియైన పద్ధతిలో సంతులితం చేయబడలేదు.
ఫారెక్స్‌లో గల కాల్షియం, విటమిన్ డి2 పాపకు పటిష్టమైన ఎముకలూ, గట్టిపళ్ళూ సమకూరుస్తాయి. సరియైన ప్రమాణంలో గల ప్రొటీన్లు, మెదడునూ, శరీరాన్నీ త్వరిత గతిలో పెరిగేలా చేస్తాయి. పాప అవసరాలకు కావలసిన శక్తి యిస్తుంది. అందుకే తల్లులు మిగతా వాటికన్న ఫారెక్స్‌నే ఎంచుకుని యిస్తున్నారంటే ఆశ్చర్యం ఏమీ లేదు.

**ఫారెక్స్, తల్లి పాలనుంచి మార్చే సమయంలోని ఆదర్శ ఆహారం**
వివిధ రకాల ఆహారాలతో కలిపినప్పుడు రుచిగా ఉండేది ఒక్క ఫారెక్స్ మాత్రమే. పళ్ళు, కూరగాయలు, పప్పు, మాంసం, గుడ్లు లాంటి అవసరమైన ఆహార పదార్థాలను ఫారెక్స్‌తో కలిపి పాపకు అలవాటు చేయవచ్చును. మీ పాప వీటిని రుచిగా, యింట్లో అందరితో బాటు యిష్టంగా తింటుంది.

**ఫారెక్స్ పుస్తకం కోసం, రూ. 2 తగ్గింపు పథకం కోసం రాయండి...**
మీపేరు, విలాసం (ఏ భాషలో పుస్తకం కావాలో రాయండి), దానితో బాటు 25 పై. స్టాంపులు, పోస్ట్ బ్యాగ్ 19119, బొంబాయి 400 025కి రాయండి.

## డాక్టర్లు సిఫార్సు చేస్తారు
# ఫారెక్స్®
### సంతులిత ఘన ఆహారం
### త్వరగా సంపూర్ణమైన పెరుగుదలకోసం



**పాపకు 3 నెలలు వచ్చాయంటే, పెరిగే సమయం మొదలైందన్న మాట.**
పాప శరీరమూ దానితో బాటే మెదడూ పెరగటం ప్రారంభిస్తాయి. అప్పుడు పాలు మాత్రమే యిస్తే చాలదు, అసలు తల్లి పాల నుంచి మార్చే యీ సమయమే ఎదుగుదల సమయం. సున్నితమైన పాప జీర్ణకోశానికి యింట్లో అందరూ తినే ఆహారాన్ని తిని అరిగించుకునేలాగ చెయ్యాలి. దానికి ఫారెక్స్ యివ్వడం కన్న మించినదిలేదు.




గ్లాక్సో

LIL.GF.53-934 TL

నావి అయిదు తీసుకోండి !" అని డబ్బు యిచ్చాడు.

సంతోషంతో గబగబా మెట్లుదిగి, "సక్సెస్ ! గ్రేట్ సక్సెస్ !" అని అరచుకుంటూ వచ్చింది రమ. శాంతకుమార్ దగ్గరకొచ్చి "ఏమండీ మంచి వెరైటీ ఆరో నంబరు చెప్పలు యీ ముప్ఫయ్ మూడు రూపాయలకీ తీసి యివ్వండి. బిల్లు మన శశి పేరిట వెయ్యండి !" అంది.

"నా పేరిట వద్దు. రమ పేరుతో వెయ్యండి" అంది శశి.

"పేక్ చెయ్యమంటారా?" కుమార్ అడిగాడు.

"వద్దు... అంతా యిక్కడే వుండండి. ఆయన రాగానే మనం సర్‌ప్రైజ్ చేద్దాం ! ఏం ?" అంది రమ.

"అలాగే !" అన్నారందరూ.

శాంతకుమార్ జోళ్ళూ, బిల్లూ తెచ్చి రమ కిచ్చాడు. రమ డబ్బు శశి కిచ్చి బిల్లు మొత్తం జమ కట్టేసింది. అందరూ తలుపుదగ్గరే నిలబడి వున్నారు. పది కావస్తోంది. అతడి జాడ లేదు.

"తాతయ్యే మనల్ని సర్‌ప్రైజు చేసేట్టు న్నాడు" అన్నాడు సాంబమూర్తి.

"ఇదేంటండీ బాటిక్ వర్కా ?" అన్నాడు హాలు ఆ చివరనుంచి ఒక ఏకైక కస్టమరు.

"కాదండీ ! కలం కారీ వర్కు. కావాలా ?"

అతడు తలూపాడు. సాంబమూర్తి గొణు క్కుంటూ అటువేపు వెళ్ళాడు. కొత్తబట్టలు వేసుకుని ముఖంమీది చెమటను ముంజేతితో తుడుచుకుంటూ, సందు తిరిగి వస్తున్న 'పాకెట్‌మార్' గ్లాస్ డోర్‌లో నుంచి వాళ్ళకి కనిపించాడు.

"వచ్చేస్తున్నాడు" అంది రమ. అందరూ లేచి నించున్నారు. అతడు లోపలికి రాగానే "హాపీ బర్త్‌డే తాతయ్యగారూ !" అంది రమ ముందుగా అందరూ అతడితో కరచాలనం చేశారు. అందరూ అతడికి "హాపీ బర్త్‌డే" చెప్పారు.

"మీరు మాకు ఆదరణీయమైన కస్టమరు. మా అందరి తరఫునా యిది మీకు కానుక !" అంది రమ. అంతా గోలగా చప్పట్లు చరిచారు. ఈ గోల పైకి వినబడి, మేనేజరు గబగబా మెట్లు దిగి వచ్చాడు. ముసలాయన దగ్గరికొచ్చి, కరచాలనంచేసి, "స్వీకరించండి యీ కానుక !" అన్నాడు రమ అందించిన జోళ్ళను అతడికిస్తూ.

"ఒరే ! ఒరే ! మీరంతా ఎంత లాయల్ వర్కర్సురా ! మీలాంటి వాళ్ళుంటే నేనెంతో గొప్పవాణ్ణి అయిపోయివుందును !" అన్నాడు






ఆనందంతో వుక్కిరిబిక్కిరి అయిన ముసలాయన. చిరునవ్వు నవ్వి, తల పంకించి, మానేజరు వెళ్ళిపోయాడు.

ఆయన మాటలకి అందరూ మళ్ళీ చప్పట్లు చరిచారు. ముసలాయన ఊపిరి పీల్చుకుని, కళ్ళనీళ్ళు తుడుచుకుని "వుండండి, వుండండి ! వన్ గుడ్ టర్న్ అని యింగ్లీషులో అంటారే — అలాగ, మీరు నాకు బహుమతి యిచ్చినందుకు, నేను మీకు బహుమతి యిస్తాను. మీకందరికీ, కాఫీ టిఫిన్లు యిప్పిస్తాను పదండి !" అన్నాడు.

"పదండి ! పదండి !" అన్నారు అందరూ.

"అమ్మాయ్ ! రమా ! మీ బావని కూడా రమ్మని ఫోనుచెయ్యి ! హోటల్ పాలెస్‌కు రమ్మని చెప్పు !" అన్నాడతడు.

"పాలస్‌కా ?" ఆశ్చర్యంతో అడిగింది రమ.

"ఈ ముసలివాడికి అన్నీ కాస్ట్లీ అలవాట్లు న్నట్టున్నాయి. అది ఫైవ్‌స్టార్ హోటల్. ఒక్కొక్కరికీ కాఫీ టిఫిన్లకే పదిరూపాయలు కావచ్చు !" అని శశికళ గొణిగింది రమ చెవిలో.

రమ అచేతనంగా బావకి ఫోన్ చేసింది. "పదండి, పదండి !" అని తొందరచేస్తున్నా డతను. "యాభై రూపాయలు తీసుకురా శశీ !" అని నిస్పత్తువగా అంది రమ.

"పాలెస్‌కా ?" అన్నాడు విక్టర్. అతడి ముఖం పాలిపోయి వుంది. "అర్జంటుగా నేను డిపార్టుమెంటులో ఇన్వెంటరీ చెయ్యాలండీ ! నేను రాలేను. సారీ !" అన్నాడు.

ఇలాగే ఒక్కొక్కళ్ళూ జారుకున్నారు. ముసలాయన వీధిన నడుస్తుంటే రమా, శశీ మాత్రం వెంట నడిచారు. "యీ బిల్లులో కూడా భాగం పంచుకోవలసి వస్తుందని అందరూ వెళ్ళారు. పోనీలే, ఆయన దగ్గర డబ్బు లేకపోతే మనం యిద్దాం !" రమతో అంది శశి మెల్లగా. రమ నిట్టూర్చింది, "అలాగే" నంటూ.

ముసలాయన కొంతదూరం నడిచి, వెనక్కి తిరిగిచూసి, "ధర్మరాజు స్వర్గారోహణ చేస్తుంటే, అతడి వెంట ఒక కుక్క నడిచిందంట. మీరు ఇద్దరున్నారు !" అన్నాడు.

"అదేమిటండీ. మమ్మల్ని కుక్కలతో పోలుస్తున్నారన్నమాట !" అంది శశికళ నవ్వుతూ.

"కాదులే అమ్మాయ్ ! ఆకుక్క సామాన్యమైనదికాదులే !" అన్నాడాయన.

పాలెస్ హోటలు మెట్లెక్కుతోంటే బేరర్లందరూ అడ్డు తొలగి దారి యిచ్చారు వాళ్ళకి "చూశారా ! నాకెంత మర్యాద లభిస్తోందో ! అందరూ అడ్డం జరిగి, స్వాగతం చెప్తున్నారు !" అన్నాడాయన నవ్వుతూ.

"అది మీ గొప్పేం కాదులేండి ! మీ వెనక ఆడకూతుళ్ళం యిద్దరం వస్తున్నామని దారి యిస్తున్నారు" అంది శశికళ.

అతను బుర్రగోక్కుంటూ "అంతేనంటావా? ఇదంతా నాగొప్పే ననుకున్నానే !" అన్నాడు. హాలు కొసనవున్న ఒక రూములోనికెళ్ళి కూర్చున్నారు.

బేరరు వచ్చాక "మళ్ళీ కాసేపటికిరా !" అని ముసలాయన తరిమేశాడు. "చూడు రమా! మీ గోపాలం రావడానికి కాస్త ఆలస్యం కావచ్చు. కాబట్టి ఒక కథ చెప్తాను వినండి. ఏం శశీ ?" అన్నాడు.

"అలాగే" నన్నారు యిద్దరూ.

"ఒకసారి ఒకడు బొంబాయి వెళ్ళాడు. అక్కడ ఒక బట్టలమిల్లు వేలంవేస్తున్నారని తెలిసి చూద్దామని వెళ్ళాడు. మాసినగుడ్డ లేసుకుని, బటాణీలు నముల్తూ ఒక మూల నిలబడిన అతణ్ణి ఎవ్వరూ గమనించలేదు. పాట పదమూడు లక్షల వరకూ వచ్చి ఆగిపోయింది. అక్కడ పాటదారులంతా కుమ్మక్కయి వేసిన ఎత్తుగడ అది. నిజానికామిల్లు పాతిక లక్షలకి పైనే విలువ చేస్తుంది. బికారిలా వున్నాడని అన్నానే అతడు 'పధ్నాలుగు లక్షలు' అన్నాడు. అంతా విస్తుపోయారు. అయినా యీ బికారిరాముడేం కడ్తాడని వూరుకున్నారు. పాట అక్కడికి ఆగిపోయింది. అప్పుడు పధ్నాలుగు లక్షలకి చెక్కు యిచ్చి ఆ ఫాక్టరీ కొన్నాను !"

"మీరా !" అంది శశికళ.

"మీరా !" అంది రమ. "అంత డబ్బు..."

ముసలాయన నవ్వాడు. "ఆఁ ! నేనే... విను, మరి ! అక్కడితో అయిందా ! ఆ రాత్రి నా హోటలు గదికి ఒక వ్యాపారస్థుడు వచ్చి ఇరవై లక్షలకి అది నా దగ్గర్నుండి తీసుకున్నాడు ఒక్క రాత్రిలో ఆరు లక్షలు లాభం !"

"ఆరు లక్షలు !" అంది రమ.

"అబ్బ !" శశికళ కళ్ళలో నీళ్ళు తిరిగాయి.

తలుపు దగ్గర అడుగుల చప్పుడయింది. ముసలాయన తలెత్తి చూసి "రావోయ్ గోపాలం ! ఇప్పుడే అమ్మాయిలని రంజింపచెయ్యడానికి ఒక కథ చెప్తున్నాను. రా, కూర్చో !" అన్నాడు.

గోపాలం భయం, భయంగా లోపలికొచ్చాడు. "సార్, మీరు, మీరు..." అన్నాడు.

"నాకు తెలుసులే ! నేను యీ హోటల్ ఓనరు రాంబాబునని తెలుసుకొని వుంటావని వూహించానులే ! రా కూర్చో! ఇవాళ నా బర్త్‌డే. అమ్మాయి నా కొక జోళ్ళజత, చందాలు పోగుజేసి, బహుమతిగా యిచ్చింది. నేనూ అమ్మాయి కొక బహుమతి యిస్తున్నాను. నీకు యిప్పుడే డెబ్భై వేలకి చెక్కు యిస్తున్నాను. నీకోసం కాదు. అమ్మాయికోసం. నీ గుణం కూడా నాకు నచ్చిందనుకో. అయితే యిది దానం కాదు. మూడేళ్ళలో ఈ సొమ్మంతా నువ్వు చెప్పినట్టు తీర్చేయాలి. అయితే అప్పు తీరేవరకూ పెళ్ళి చేసుకోకుండా కూర్చుంటానంటే ఒప్పుకునేది లేదు. రేపే, నీకూ మా అమ్మాయికీ రిజిస్ట్రారు ఆఫీసులో పెళ్ళి. ఏమ్మాయ్ ? నీ కిష్టమేనా ?"

రమ నోటమ్మట మాటలు రాలేదు, శశి "కంగ్రాట్స్ రమా !" అంది.

రాంబాబు చిటికె వేశాడు. "బేరర్ ! డెబ్భై వేలకు గోపాలం పేరిట చెక్కు రాయించి తీసుకునిరా !" అన్నాడు. "బేరర్ వచ్చేంతలో మీకేం కావాలో ఆలోచించుకోండి ! ఈ 'పాకెట్‌మార్' ఎలా బిల్లు పే చేస్తాడని ఆందోళన పడకండి !" అన్నాడు.

# టినోపాల్* ఇప్పుడు ఓ కొత్త పేరుతో

# రానిపాల్+






ఉత్పాదన అదే, పనితనం అదే, కాని పేరు మాత్రం కొత్తది.

## సర్వోత్తమ తెలుపు కోసం రానిపాల్+

**Suhrid Geigy**
LIMITED

+ సుహృద్-గైగి లిమిటెడ్ వారి ట్రేడ్ మార్క్ * ఇంతకు పూర్వం సిబా-గైగి లిమిటెడ్ వారి లైసెన్సు క్రింద అమ్మబడెను.

Shilpi SGT 6A/76 (H)

## 28-1-1977 శుక్రవారం మొదలు 3-2-1977 గురువారం వరకు

**మేషం:-** రావలసిన డబ్బు అందుతుంది. ప్రయోజనం గల పరిచయాలు ఏర్పడతాయి. రాజకీయ వ్యవహారాలు బాగుంటాయి. మిత్రులకు సహాయంచేస్తారు. అధికారులవలన జరగవలసిన వ్యవహారాలు బాగుంటాయి. స్త్రీలకు- కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

> ## రాలిన ముత్యాలు
>
> ......శ్రీ సోమసుందర్......
>
> నదీ తలాని కున్న రెండుగట్లు...
> కర్తవ్యం నిర్మించిన వెన్నెల మెట్లు...
> గట్టు పై బలంగా నిలచిన
> వనస్పతుల బారులు
> ఆనంద దుర్గానికి నిర్మించిన
> ఊయెల వేరులు!

**వృషభం:-** వృత్తి వ్యాపారాలు బాగుంటాయి. ప్రయాణాలు ఫలిస్తాయి. విద్యా వైజ్ఞానికరంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి. శుభ కార్యాల విషయంలో అనుకూలత లభిస్తుంది స్త్రీలకు- ఆరోగ్యం బాగుంటుంది. విలువ వస్తువులు కొంటారు.

**మిధునం:-** మీ తాలూకు మనుష్యులే మిమ్మల్ని వ్యతిరేకిస్తారు. ఉద్యోగంలో చికాకులు ఏర్పడతాయి. వారం మధ్యలో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. బంధుమిత్రులను కల్సుకొంటారు. వ్యాపారంలో ఆదాయం బాగుంటుంది. స్త్రీలకు- కుటుంబ వ్యవహారాల్లో శ్రమకలుగుతుంది. పోటి వారిలో గౌరవం లభిస్తుంది.

**కర్కాటకం:-** వృత్తిలో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. నూతన వ్యవహారాలు బాగుంటాయి. వారం మధ్యలో వ్యతిరేకత ఏర్పడుతుంది. ఉద్యోగంలో యెవరినీ విశేషంగా నమ్మడం తగదు. ప్రయాణాల్లో శ్రమ కలుగుతుంది. స్త్రీలకు- ఆరోగ్యం బాగుండదు. సాహిత్య కళా రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది.

**సింహం** అధికారులవలన జరగవలసిన వ్యవహారాలు బాగుంటాయి. సజ్జన సాంగత్యం లభిస్తుంది. వ్యాపారంలో నూతనావకాశాలు లభిస్తాయి. సాహసిక వ్యవహారాలు బాగుంటాయి. మిత్రుల సహాయం లభిస్తుంది. స్త్రీలకు-పుణ్య కార్యాలు చేస్తారు. సంతానానికి సౌఖ్య సంతోషాలు లభిస్తాయి.



**కన్య:-** అనుకూలమైన వార్తలను వింటారు. సాహిత్య కళా రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. ప్రయోజనంగల పరిచయాలు ఏర్పడతాయి. అన్ని వ్యవహారాల్లోను గౌరవం బాగుంటుంది. సిరాస్థి వ్యవహారాలు బాగుంటాయి. స్త్రీలకు-ఆరోగ్యం బాగుంటుంది. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

---

ఈ పాలెంలో నీ మాదిరి కులం చెడినోడెపుడూ లేడు, రేపు పొద్దు నాలుగు బారలెక్కినాక ఈ పాలెంలో యాడన్నా మెదిల్నావంటే మెట్లపాలయి పోతావు. అగ్గరానికి పోయినన్నాసి కాపోడి నెవుర్నన్నా కాళ్ళు పట్టుకుని గుడిసె యేసుకుంటావేమో. అట్ట జేసినావంటే నీ గుడిసెకూ నాని కొంపకూ అగ్గి పెట్టబోయేటోడ్ని నేను' అంటూ సత్తిగాడు ఎడమ చేతిని పైకెత్తి మీసాన్ని నిమిరాడు.

'అట్టాంటి దోహం నీకు నేనేమి జేసినానో?' అన్నాడు రామచంద్రుడు.

సత్తిగాడు తన చేతి బొటన వేలితో రొమ్మును ముట్టుకుని చూపుతూ 'నువ్వు నాకు దోహం జేస్తే ఒకటా, మా రెడ్డికి చేస్తే ఒకటా?' అని తరవాత ఆ చేతిని గాలిలో నాలుగు దిక్కులు చుట్టి వచ్చేట్టు త్రిప్పి, 'దిక్కులకు పెక్కాసి లెక్కనోడు మా రెడ్డి. నువ్వు కండ్లు తెరిస్తే కనబడేది ఆయన బూమిలే: ఆయన లోటలే అట్టాటోడికా టే నీకు లెక్కలేక పోయిందె గదరా. నీకు ఎన్ని గుండెకాయలున్నట్టురా' అన్నాడు.

రెడ్డిగారి ఘనత ముందు తల వంచుకున్న వాడివలె రామచంద్రుడు తల వంచుకుని. 'ఎంతటోడైతే మా తం కోరుట్టలో కొచ్చి నిర్నిమిత్తంగా పచ్చి అబద్దం-'

'నీ యమ్మను మాదిగోడు-' అంటూ సత్తిగాడు లేచాడు. ఉద్రేకంలో వాడు కత్తిని చేతిలోకి తీసుకోవడం మరచిపోయాడు. వాడి చేయి రామచంద్రుని ఎడమ చెంపను ఫెడీల్మని తాకింది. అంతా లిప్త కాలంలో జరిగిపోయింది. రామచంద్రుడు సమాళించుకుంటూ ఉండంగా అదే చెంప మీద మరొకదెబ్బ పుష్టిగా పడింది. సత్తిగాడు ఉద్రేకంతో ఊగిపోతున్నాడు. "నీ నెత్తురు తాగేస్తానాకొడకా అబద్ధమయిందీ, నిజమయిందీ నువ్వు జూసినావంటా. "అంటూ వాడు రామచంద్రుని గొంతు క్రింద చేయి పెట్టి బలంగా తోశాడు.

ఆ తోపుడుకు రామచంద్రుడు తూలుతూ వెళ్ళి నాలుగుబారల దూరాన పడ్డాడు. గుంజకు వ్రేలాడుతుండిన పెట్రొమాక్స్ దీపం అతని భుజం తగిలి ఊగసాగింది. దాని కిరోసిన్ సరఫరాలో అంతరాయం కలిగింది. అది గప్పు గప్పుమని రెండుసార్లు ఎర్రని మంటలను వెదజల్లి మళ్ళీ యధాప్రకారం వెలగసాగింది.

సత్తిగాడు తిరస్కారభావంతో రామచంద్రుడిని కొంతసేపుచూసి, కూర్చుని తన పనిలో మునిగిపోయాడు.

రామచంద్రుని చెంప విపరీతంగా మండుతున్నది. గత రెండుమూడు దినాలుగా అతడు

# ఇన్‌క్రెడిబుల్ గాడెస్

(18వ పేజీ తరువాయి)

చెరకు తోటలో పని చేసుండటం మూలాన వాడియైన చెరకు ఆకులచేత అతని చెంపలు కోసుకుపోయి ఉన్నాయి. ఆ చెంపల మీద గుడ్డపీలిక పడినా జిల జిలమని బాధ కలిగేది. ఇప్పుడా చెంపలు వ్రణముల వలె మండుతున్నవి.

అతడు భారంగా లేచి నిలుచున్నాడు. పెట్రొమాక్స్ దీపం ఇంకా స్వల్పంగా ఊగుతూ ఉంది.

గోడవారన గారతొట్టి ఒకటి ఉన్నది. దాని నిండా పుల్లటి నీళ్ళు ఉన్నవి. కొంత సమయం క్రితం హరిజనులు తొట్టి చెంత కూర్చుని భోజనం చేశారు. తిన్నతరువాత వారందరూ ఆ తొట్టిలో చేతులు కడుగుకోవటంవలన ఆ నీళ్ళు పుల్లగా ఉన్నవి. ఎండు మిరపకాయలూ, కరివేపాకు ముక్కలు కొన్ని నీటిమీద తేలుతున్నాయి. వాళ్ళు సంగటి ముద్దలను మర్రి ఆకులమీద పెట్టుకుని భోంచేశారు. మర్రి ఆకులు తొట్టి చుట్టూ పడి ఉన్నవి. అవి ఇంకా తేమగా ఉండి బరువుగా ఉండటం మూలాన గాలి పాటుకు అవి ఎగరటం లేదు.

మర్రి ఆకులను అంటి పెట్టుకుని ఉన్న

**తుల:—** చేజిక్కిన అవకాశాలు కూడా జారిపోవచ్చును వ్యాపారంలో ప్రయాస కలుగు తుంది. వారం మధ్యలో రావలసిన డబ్బు అందు తుంది. మిత్రులకు సహాయం చేస్తారు. సంతోష కరమైన సమాచారం అందగలదు. స్త్రీలకు— కుటుంబ వ్యవహారాల్లో కార్యభారం పెరుగు తుంది. అలంకార వస్తువులు కొంటారు.

**వృశ్చికం:** మీ ఆలోచనలు ఫలిస్తాయి. సాటి వారిలో గౌరవం బాగుంటుంది. వారం మధ్యలో శ్రమకలుగుతుంది. సాహసిక వ్యవహారాల్లో నష్టం వస్తుంది. ఆందోళన కలుగుతుంది. ప్రయాణాలు వాయిదా పడతాయి. స్త్రీలకు— ఆరోగ్యం బాగుండదు. బంధుమిత్రులను కలుసు కొంటారు.

**ధనుస్సు:** రాజకీయ వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది. వృత్తిలో సాటివారి పోటీ పెరుగు తుంది. వారం మధ్యలో రావలసిన డబ్బు అందు తుంది. ప్రయోజనకరమైన సంభాషణలను జరుప గలరు. ఉద్యోగంలో గౌరవం బాగుంటుంది. స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. దైవకార్యాలు నెరవేరతాయి.

**మకరం:** సాహసిక వ్యవహారాలు బాగుం టాయి. ప్రయాణాలు ఫలిస్తాయి. ఇతరుల నిమిత్తం శ్రమకు గురిఅవుతారు. మీ కార్యక్రమా లకు మార్పులు వస్తాయి. వృత్తిలో శ్రమమీద లాభం అందుతుంది. స్త్రీలకు— ఆరోగ్యం బాగుంటుంది. ఎవరితోను వాద ప్రతివాదాలు తగవు.

**కుంభం—** అన్ని వ్యవహారాల్లోను ఫలితం సామాన్యంగా ఉంటుంది. దైవకార్యాలు నెర వేరతాయి. వారం మధ్యలో విద్యా నైపుణ్య నిక రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. వృత్తిలో ఆదాయం బాగుంటుంది. మిత్రుల సహాయం లభిస్తుంది. స్త్రీలకు సాటివారిలో గౌరవ బాగుంటుంది. నూతన విషయాలను తెల్సుకొం కొంటారు.

**మీనం—:** మీ కార్యక్రమాలు చురుకుగా సాగుతాయి. రాజకీయ వ్యవహారాలు బాగుం టాయి. వారం మధ్యలో ప్రయాణాలు వాయిదా పడతాయి. సామాన్యమైన పనులకు కూడా ఎంతో కృషి చేయవలసి వస్తుంది. పుణ్యకార్యాలు చేస్తారు. స్త్రీలకు— ఆరోగ్యం బాగుంటుంది. శుభకార్యాల విషయంలో అనుకూలత లభిస్తుంది. ●

## వర్షాలులేని సంవత్సరాలు

వర్షాభావ ప్రాంతాలనూ, వర్షాభావ తీవ్రతనూ ముందుగానే కనిపెట్ట వచ్చునని సోవియట్ విజ్ఞాన శాస్త్ర పరిషత్తుకు సంబంధించిన ఆగ్రో-కెమిస్ట్రీ, సాయిల్ ఇన్‌స్టిట్యూట్ డైరెక్టరు విక్టర్ కోవ్దా టాస్ ఇంట ర్వ్యూలో చెప్పారు. సౌర ప్రజ్వలనలు చాలా తక్కువగా వున్న సంవత్సరాలలో వర్షాభావం అత్యంత తీవ్రంగా వుంటుం దని శాస్త్ర వేత్తల విశ్వాసం. అందు వల్ల 1983-86 సంవత్సరాలలో వర్షాభావం వుంటుందనీ, 1978 - 1980 సంవత్సరాలలో గాలితో తేమ ఎక్కువగా వుండి, పంటలు పుష్క లంగా పండుతాయని భావించవచ్చు.

---

ఎంగిలి కోసం గజ్జి కుక్కలు పరతెంచి వచ్చాయి. అవి తమలో తాము పోట్లాడు కుంటున్నాయి. సన్నగనూ, నాజూకుగానూ, ఉన్న కుక్క ఒకటి ఆ మందలోకి ప్రవేశిం చింది. దాని చుట్టూ వెంటుకలతో పేనిన దారం ఉన్నది. ఆ దారానికి తెల్లని గవ్వ పతకం వలె వ్రేలాడు తున్నది. ఆ కుక్క ఈ వూరిది కాదని, అది నిన్నటిదాక ఎక్కడో యజమాని వద్ద గారాబంగా పెరుగుతూ ఉండేదని సహజంగానే తెల్సుకోవచ్చు. దారి తప్పిగాని, లేక యజమానిచేత గెంటబడిగాని అది ఈ గజ్జి కుక్కల మధ్యకొచ్చి పడి ఉంటుంది. రోతుకు పీక్కుపోయిన దాని డొక్కలు ఉద్భాదను తెలియజేస్తున్నాయి.

ఆ సన్నటి కుక్క పరాయిదని తెలుసుకోవ డానికి మిగిలిన గజ్జి కుక్కలకు ఎంతో సేపు పట్టలేదు. ఆ ఎరుక కలగగానే గజ్జికుక్కలు తమలో తాము పోట్లాడుకోవడం మానివేసి, వొక్కుమ్మడిగా సన్నటి కుక్కమీద పడ్డాయి. అవి భయంకరంగా కోరలు చూపుతూ, వర్షా కాలపు మేఘంవలె దీర్ఘంగా మొరుగుతూ సన్నటి కుక్కవైపు ఉరకసాగాయి. సన్నటి కుక్క నాలు గడుగులు వెనకకువేసి వోటమిని అంగీకరిస్తున్నట్టు, నెత్తిని క్రిందకు వేసి, తోకను తొడల మధ్య ఇరికించి కొంతసేపు అలాగే నిలుచుంది. తరవాత సందిని కోరుతు న్నట్లు తోకాడిస్తూ వచ్చి ఒక గజ్జికుక్క మూతిని నాకి నేలను మూచుస్తూ గారతొట్టి చెంతనున్న ఎంగిలాకులవైపు సాగబోయింది. గజ్జికుక్కలన్నీ 'భౌ భౌ'మని మొరుగుతూ దానిమీద విరుచుకపడ్డాయి. ఒక బొట్టు రక్తాన్ని వేయిచీమలు కమ్ముకుని అరగిస్తు న్నట్లు ఆ గజ్జి కుక్కలన్నీ సన్నటి కుక్కను చుట్టుముట్టాయి. వాటి అరుపులతో ఆ ప్రాంత మంతా ప్రతిధ్వనించ సాగింది. వాటి తొక్కిళ్లచేత తొట్టి చుట్టూఉన్న తేమనేల రొచ్చు రొచ్చుగా మారిపోయింది. ఆ బురదలో మర్రిఆకులు కూరుకు పోయాయి. కుక్కల శరీరాలు బురదమయమై పోతున్నాయి.

దాపున పని చేస్తున్న హరిజనుడొకడు కుక్కల రావిడివే చిరాకు జెందాడు. వాడు చేయి చాచి ఒక ఇటుక రాతి ముక్కను తీసుకుని అటు పెనుగులాడుతున్న కుక్కల గుంపు మీదకు విసిరాడు. ఒక కుక్క వెన్ను విరిగినట్లు "కుంయ్ కుంయ్" మంటూ పరుగెత్తింది. మిగిలిన కుక్కలన్నీ చెదిరి పోయి గారతొట్టి వెనక నిలుచున్నాయి.

సన్నటికుక్క బురద నేలమీద నుండి లేచింది. అది మొదట వెనక కాళ్ళపైన భారంగా కూర్చుని ఆ తరువాత అతి ప్రయత్నం మీద నాలుగు కాళ్ళపైన నిలుచుంది. దాని ముందరి పాదం ఒకటి నంజర నంజరగా కొరికివేయబడింది నల్లటి ముట్టిమీద లోతుగా గాటు పెట్టబడి ఉన్నది. ఆ గాటు నుండి నెత్తురు ఉబుకుతున్నది. గొంతు క్రింద చూపుడువ్రేలి పొడవున్న గాయం ఒకటి విచ్చుకుని కనిపిస్తున్నది. దానిలో నుండి నెత్తురు సుడులు తిరుగుతూ బయలుదేరి క్రిందకు దూకుతూ తెల్లటి గవ్వను తడుపుతూ బురదనేల మీద పడుతూ ఉంది. అది కుంటుతూ, తూలుతూ అటనుండి బయలుదేరింది. పది బారలు నడచి ఒక మొండిగోడ నీడను చేరింది. ఇక నడవడం దుర్లభం కావడం చేతను, శత్రు భయం లేదని తోచడం చేతను అక్కడే కూర్చున్నది. అది వెనక కాళ్లపైన కూర్చుని ముందరి కాళ్ళలో విరిగిన దానిని గాలిలో ఎత్తిపట్టుకున్నది. ఎర్రటి నాలుకతో ముట్టి మీద పారుతున్న నెత్తురును అప్పుడప్పుడు తుడుచుకుంటున్నది.

గారతొట్టి వద్దనున్న గజ్జికుక్కలు మర్రిఆకులమీద తమ అన్వేషణను ప్రారం భించాయి.

(ఇంకా ఉంది)

# శ్ఘారకేన

## మురాల ఇందిరా రఘు

(గత సంచిక తరువాయి)

"ఇలాంటి మనుష్యులుకూడా వుంటారా?" అని రఘు ఆశ్చర్యపోయాడు. వూహించిన కొలదీ బాధగా వుందా విషయం. పాలి పోయిన చెక్కిళ్లు, కంటి క్రింద నల్లటి చారలు, అంతిమ దిశలో, దిక్కులేనట్లుగా నిర్జీవంగా పడుకున్న మాలతికి కొద్దిగా తెలివి వచ్చింది.

"బాబు వచ్చాడా రఘూ" అడిగింది మాలతి. తనకి తెలుసు తన భర్త రాడని, కాని బాబుని పిలిపించమని అడిగిన కారణం కూడా అదే మరి.

"వస్తాడు. బాబు కోసం ఫోను చేసాను. కొంచెం హార్లిక్స్ తాగు" నర్సుతో కప్పు నోటి కందించమని చెప్పాడు రఘు.

"రఘూ చివరి ఘడియలో నీ చేతుల్లో కన్ను మూద్దాం, అనేది తీరని కోరికగా మిగిలిపోతుందేమోనని ఎన్నో సార్లు బాధ పడ్డాను. భగవంతుడు కూడా ఒక్కొక్కసారి దయగలవాడుగా కొందరి కోరికలు, తీర్చు తాడేమో ననిపిస్తుంది. కనపడని దేవుడు

> *జరిగినకథ 4:* సినీతార మాలతిని కలిసి మాట్లాడుతుంది దమయంతి. ప్రకాష్ దమయంతి భర్త. గతంలో.. చిన్ననాటి స్నేహితుడు రఘుని పెళ్లి చేసుకోవాలనుకున్న మాలతి కోర్కెను నిరాకరించి త్రాగుబోతు జమిందారు గంగా ధరంతో వివాహం జరిపిస్తుంది తల్లి పార్వతమ్మ. ఆస్తి నాశనంచేసి మాలతిని సినీతార జేస్తాడు గంగాధరం. పుట్టబోయే తన బిడ్డను సినిమాల్లో చేర్పించమని కోరుతుంది దమయంతి భర్తని. చావు బతుకుల్లో వున్న మాలతి రఘు పనిచేస్తున్న ఆస్పత్రిలో చేరుతుంది.

నీతో కనపడుతున్నాడు రఘూ. నేను బాబుని గురించి చాలా బాధ పడ్డాను. వాడు తండ్రి పెంపకంలో ఎలా తయారవుతాడోనని భయ పడ్డాను. ఇప్పుడు నాకు ఆ దిగులు లేదు'' మాలతి ధైర్యాన్ని వెలిబుచ్చింది.

''నీకు ఏమీ ఫర్వాలేదు, రెస్టు తీసుకో మాలతీ'' రఘు సంభాషణ త్రుంచివేశాడు. చావుకు ముందు ప్రతివారిని డాక్టర్ ఓదార్చక తప్పదు.

''నన్ను చివరి ఘడియల్లోనైనా తృప్తిగా నీతో మాట్లాడనీయకూడదూ రఘూ'' జాలి గొలిపే విధంగా బ్రతిమాలింది మాలతి.

''అదికాదు మాలతీ, యిప్పుడు నీకు విశ్రాంతి కావాలి, డాక్టరుగా అది కలుగజేసే బాధ్యత నాది.'' రఘు చిన్నగా అన్నాడు, ఆమె మాట్లాడటం తనకిష్టమేనన్నట్లు.

దీపక్‌ని తీసుకొని పని మనిషి వచ్చింది. మాలతి బ్రతకటం కష్టమని రఘుకి తెలుసు. ఆపరేషన్ విజయవంతమైనా రక్త ప్రసరణలో మార్పు రావటంవలన గుండె పనిచేయటానికి అంతరాయం కలిగింది. విదేశాల స్పెషలిస్టులకు కూడా చూపిం చాడు. కాని లాభం లేదన్నారు. ఆమె శరీరం శిథిలావస్థకు వచ్చింది. ఆమెకులేని సుఖ రోగాలు లేవు. ఇంక ఎలా బ్రతికించగలరు డాక్టర్లు మాత్రం! అయినా ఆమె మీద మమకారం పోలేదు రఘూకి. హస్పటల్లో మాలతి బాబుని చూసిన వారంతా ''రఘూ పోలికలేనని అనుకొనటం మొదలైంది. బహుశా జెనిటెక్స్ సిద్ధాంత ప్రకారం ఆమె గర్భవతిగా వున్నప్పుడు రఘూని ఎక్కువగా తలచుకుని వుండవచ్చు''డాక్టరు అనుకున్నాడు.

బిడ్డలు పెరిగి పెద్దవారైతే ఏమి, ఒరగ బెడతారో కాని వారికొరకు తల్లి తండ్రులు పడేబాధ, మాటలతో వర్ణించటానికి వీలుండదు.

'మమ్మీ' అంటూ తల్లినివాక్క సారిగా కౌగలించుకొన్నాడు నాతో చెప్పకుండా వచ్చేసావు. నేను కాన్వెంట్‌నుంచి వచ్చిన తరువాత నాన్నగారిని అడిగాను. నాన్నగారెమొ వాడెవడో రఘూ గాడికోసం, వంకపెట్టుకొని హాస్పటల్లో చేరిందిరా, మీ అమ్మ, అని నిన్ను తిట్టారు మమ్మీ!

ఆయా ఏమోనాన్నగారి ప్రక్కన సోఫాలో కూర్చుంది. నేను మా అమ్మ వచ్చిన తరువాత చెప్పతాను వుండు అంటే, మీఅమ్మ యింకరాదు! చచ్చిపోతుంది అంది. నేను, మా మమ్మీ ఎక్కడికి వెళ్ళదు నన్నువొదిలి అన్నాను. నన్ను వదలి ఎక్కడకు వెళ్ళకు మమ్మీ, నీవు యింటికి వచ్చిన తరువాత ''ఆయా'' ని మానిపించి క్రొత్త 'ఆయా'ని పెట్టు' ఐదు ఏళ్ళురాని బాబు దీపక్ ఏడుస్తూ ముద్దు ముద్దుగా అన్నాడు; దీపక్. పిన్నహృదయం నుంచి వచ్చినమాటలు అచ్చట వున్నవారిని కూడా జాలిగొలిపాయి ఆమాటలు మాలతిని ముగ్ధురాలను చేశాయి. చావుకు ముందు బాబు తన దగ్గరున్నాడు. అంతేచాలు అమ



కుంది. కాని దుఃఖం కట్టలు త్రెంచుకు వచ్చింది.

''వూరుకోబాబు నిన్ను వదలి నేను ఎక్కడికి వెళ్ళను, ఈయన డాక్టరు గారు బాబునమస్కారం పెట్టు'' అంది మాలతి రఘుని చూపెడుతూ. రెండు చేతులు జోడించి నమస్కారంచేశాడు బాబు.

''నీపేరు'' రఘు అడిగాడు.

''దీపక్'' ఠంగున చెప్పాడు బాబు

''నా బాబు మూలంగా యిన్ని రోజులు ఎన్నికష్టాలొచ్చినా ఎదుర్కొన్నాను. రఘూ'' అంది మాలతి.

రఘూ అని మాట వినంగానే,తండ్రి అన్న మాటలు గుర్తుకు వచ్చాయి. బాబుకి.

కాని ఎర్రటి కళ్ళు, రేగిన జుట్టు గళ్ళ లుంగీలో, బజారు రౌడీలాగా వుంటాడని వూహించుకున్న బాబుకి, తెల్లటి బట్టలలో వెరగని చిరునవ్వుతో ఎంతో అందంగా వున్న రఘుని చూడగానే దీపక్‌కి రఘు అంటే భయం పోయి, గౌరవం హెచ్చింది.

''మాలతీ విశ్రాంతి తీసుకో. బాబును మా యింట్లో పడుకోబెట్టి నేను మళ్లీ వస్తాను''

దీపక్‌ని తీసుకొని క్వార్టర్సుకి వెళ్ళి పోయాడు రఘు.

మాలతికి గుండెపోటు ఎక్కువ కావటంతో నర్సు ఫోను చేయగానే వచ్చాడు రఘు.

''రఘూ నేను బ్రతకను. నాకు మందులు వద్దు, నీవు మాత్రం యిక్కడ నుంచి వెళ్లకు, నీకు కొన్ని వివరాలు చెప్పాలి.''

మొదలుపెట్టింది.మాలతి తన మనస్సులో వున్న విషయాన్ని విప్పిచెప్పి చెప్పటానికి.

''నాకు ఒక యిల్లు, కొద్దిగా పొలం వుంది అది బాబుకి వ్రాసాను. బాబు పేర ఏభైవేలు ఫిక్సెడ్ డిపాజిట్ వుంది. అది కాక నాకు ఇన్స్యూరెన్సు వుంది; ఆ డబ్బుతో బీదలకు అనాధలకు ఒక శరణాలయం ఏర్పాటు చెయ్యి రఘూ.

## ఓతార కధ

అటు తరవాత నెలకి ఐదువందల రూపాయల చొప్పున, మా వారికి తెలియకుండా బ్యాంకులో వేసాను. అది యిప్పటికి చాలా అయివుంటుంది. నా బంగారం బాబుకు యిచ్చివేయి. లాకర్‌లో వుంది బంగారం బాబుని మనుష్యుకు వాడి యిష్టంవచ్చిన అమ్మాయిని బీదద్కైనాసరే, ఎవర్కైనాసరే చేసుకోనివ్వండి ఆ ఒక్కటి వాడి యిష్టానికి వదిలివేయి.

మిగిలిన వాడిచదువు, వాడిని ఒకమనిషిగా తీర్చిదిదటం, నీ యిష్ట ప్రకారం చెయ్యి. నీవు చేయకలిగింది చెయ్యి. తరువాత వాడి అదృష్టం ఎలా వుంటే అలా జరుగుతుంది. దురదృష్ట వంతులను మనం బాగు చేయలేము. అదృష్ట వంతులను చెరపలేము. ఆలాగని గాలిలో దీపంపెట్టి వూరు కుంటే అది ఆరిపోతుంది. బాబును నీ నీడలో బ్రతకనియ్య! ఏదో చెప్పకు పోతుంది మాలతి.

"ఏమిటి మాలతి నీవు యిలా మాట్లాడకూడదు," ఏదో-ఇంజెక్షను యివ్వటానికి ప్రయత్నించాడు రఘు.

"రఘూ నీవు యిక్కడే వుండు. నాకేదో భయంగావుంది," రఘు చెయ్యి గట్టిగా పట్టుకొని బతిమాలే ధోరణిలో అంది.

"నీవు కళ్ళు మూసుకొని పడుకో, నేను నిన్ను వదిలి ఎక్కడికి వెళ్ళను," ఓదార్చాడు రఘు.

"అంటే నాతో వస్తావా" చివరి సారిగా నవ్వింది మాలతి

"నీతో రావటానికి నాకు అభ్యంతరం లేదు" అతనూ నవ్వాడు.

*     *     *

ఇక అక్కడ గంగాధర్, యింట్లో కొంచెం విలువైన సామాను అంతా తీసుకొని ఒక ఫ్రెండుయింట్లో పెట్టాడు,ఆ రాత్రిపూట.

కొందరు ఎందుకు అలా ప్రవర్తిస్తారో అర్థం కాదు మనిషి ప్రాణం కన్నా, డబ్బుకి విలువ యిస్తారు. ప్రాణం కొన్ని లక్షలు కాదుకదా కొన్ని కోట్లు పెట్టినా రాదు. మరి కొందరు మూర్ఖులు డబ్బుకె ఇస్తారు విలువ. ప్రాణాన్ని గడ్డిపోచతో పోలుస్తారు గంగాధర్ లాంటి వాళ్ళు.

గంగాధర్ కొన్ని విలువైన సామాను సర్దుతుంటే 'ఆయా' మాలతివి ఖరీదైన చీరలు చిన్న చిన్న వస్తువులు జాగ్రత్త పెట్టుకుంది.

చావు బ్రతుకుల మధ్య వూగిసలాడుతున్న భార్య కన్నా. ఆమె సంపాదించిన వస్తువులకే విలువ వున్నది కదా? వారి దృష్టిలో!

తన విధి నిర్వహణ పూర్తి అయినట్లు చందుడు అకాశంలో కనిపించకుండా వెళ్ళాడు. తెలతెల వారుతుంది. ఈ ప్రపంచంలో రాత్రిళ్ళు జరిగే ఘోరాలు చూచిచూడనట్లు తనపని ముగించుకున్నాడు చంద్రుడు. ఒకనాటికి పాపం పండక మానదు అని హెచ్చరించివెళ్ళి పోయాడు.

"ఇంక మీరుచేసే దుష్కృత్యాలు ఆపాలి" అనివార్యరీతిక చేసే విధంగా సూర్యుడు ప్రవేశించ బోతున్నాడు రాత్రి అంతా నరక యాతన పడిన మాలతి ప్రాణం అనంత వాయువులలో కలిసి పోయింది. అవేదన పడి నంతకాలం పట్టలేదు ఆమె ప్రాణం కట్టెను విడిపోవటానికి తెల్లని బట్టనిండుగా కప్పి వేశారు.

"మమ్మీ" అంటూ బాబు ఒకటే గొడవ. "మమ్మీ మాట్లాడదే," అనే బాబు ప్రశ్నకు సమాధానం చెప్పలేక పోయారు నర్సులు ఎలా చెబుతారు! ఏమని చెబుతారు! ఎవరుచెప్పలేని ప్రశ్న. ఈ లోకంలో అదొక్కటే చెప్పలేని జవాబు గంగాధర్‌కి ఫోను ఎన్నిసార్లు చేసినా సమాధానం లేదు. రిసీవరు ఎవరు ఎత్తలేదు ఫోను చెడిపోయిందేమోననే అనుమానంతో హాస్పటల్ బోయ్‌ని పంపాడు రఘు.

తిరిగివచ్చిన బోయ్, ఇంటికి తాళంవేసి వుందని చెప్పటంతో రఘుకి ఏమిచేయాలో తోచలేదు తోటి డాక్టర్లు "మార్చురీలో" జాగ్రదపరచి. శవాన్ని వాళ్ళవాళ్ళు వచ్చిన తరువాత ఇద్దాం అన్నారు.

రఘు మాత్రం ఆమెకు ఎవరులేరు, నేనే దహన సంస్కారం చేయించుతాను, అని చెప్పాడు.

* * *

సినిమా నటి మాలతి చనిపోయిందని తెలియగానే కొన్నివేలమంది జనం, ఆసుపత్రికి వచ్చారు. అందరూ ఆఖరిసారిగా చూస్తామని జనం విరగబడటంతో, పెద్ద వేదికలాంటిది ఏర్పాటుచేసి దానిమీద మాలతి భౌతిక కాయాన్ని పడుకోపెట్టారు. మాలతి తోటి యాక్టర్లు, ప్రొడ్యూసర్లు, డైరెక్టర్లు, అందరూ మాలతి మంచిని, గురించి పొగిడారు. కళాకారుల జీవితాలు అలాగే వుంటాయి వారు బ్రతికినా చచ్చినా విరగబడి చూసే వారేగాని, వారు జీవించివున్న కాలంలో ఆదరించేవారు వుండరు చచ్చిపోయిన తరువాత వారు చేసిన గొప్పలు పొగడటం అలవాటు! మాలతి చితికి దీపక్ చేత నిప్పు పెట్టించాడు రఘు.

"డాక్టరుగారు, మా మమ్మీని కర్రలలో పెట్టేశారు, కాలిపోతుందేమోనండి" ఏడ్వటం మొదలు పెట్టాడు బాబు.

మాలతిని బోర్లా పడుకోపెట్టి, పెద్ద దుంగ మాలతిమీద గట్టిగా కాటికాపరి పడేసే సరికి రఘు ప్రాణం విలవిలలాడి పోయింది చిన్ననాటి మాలతి యిలా అగ్నిలో ఆహుతిఅయిపోతుందని, తనే దగ్గరుండి కార్పించుతానని ఆమె నూరేళ్ళ జీవితం యింతటితో ముగుస్తుందని తను అనుకున్నాడా? మాలతి చివరి క్షణాల్లో కలవకుండా వున్నట్లైతే నాకు ఈ వేదనవుండేది కాదుకదా," అని మాలతి చితికాలుతుంటె, అవతలగా కూర్చున్న రఘుకి అనిపించింది. ఏమిటో ఈ జీవితం, ఎన్ని కష్టాలు పడ్డా, ఎన్ని సుఖాలు అనుభవించినా, ఎంతఉపకారి అయినా, కాకపోయినా గొప్పవాడుగాని, బీద వాడుగాని ఈ మట్టిలో కలసిపోవలసిందే గదా! ఈ కట్టెలలో కాలవలసిందేగదా! నిత్యం లేని బ్రతుకు కోసం ఎన్నోఘోరాలు చేస్తాడు మానవుడు. ఎప్పటికైనా మృత్యువు తప్పదని తెలిసి కూడా ఎన్నో కష్టాలు పడతాడు. కదా, అనిస్మశాన వైరాగ్య ధోరణిలో ఆలోచించ సాగాడు, రఘు బాబుని దగ్గరకు తీసుకొని ఏదిక్కు లేని దీపక్‌కి తనే దిక్కేమో అనుకున్నాడు. తెల్లగా ముద్దుగావున్న దీపక్‌ని చూస్తుంటే తల్లిలేనిలోటు రాకుండా బాబుని పెంచాలి అనుకున్నాడు రఘు.

మాలతి ఆత్మ బాబుకి ఒక నీడ చూపాననే తృప్తితో వెళ్ళి పోయి వుంటుందని నమ్మాడు రఘు.

రఘుతో జీవితాన్ని, తాను పంచుకోలేక పోయినా కనీసం, ఆమె ఆశాజ్యోతి అనుకున్న బాబుని, మటుకు చేర్చవలసిన చోటుకి చేర్చాను కదా అని తృప్తిగా చివరి ఘడియల్లో ప్రాణాలు వదిలిందని రఘు నమ్మకం.

ఎవరికి ఎవరో తెలియని స్థితిలో పరిస్థితి వున్నది. కాని రఘు వృత్తిరీత్యా తను చేయవలసింది గాక, మమతానుబంధంవల్ల కూడా మాలతిని బతికించటానికి ప్రయత్నం చేశాడు. కాని ప్రయోజనం లేకపోయింది.

"చివరి ఘడియల్లో మాలతి భర్త, మాలతి దగ్గర వుంటే చూసే వారికి మాలతికి, అందరికి సంతృప్తిగా వుండేది కదా" అనుకున్నాడు.

అయినా ఆమెకు అవసాన దశలో కొండంత అండ దొరికిందనే నమ్మకాన్ని కలిగించ గలిగాడు రఘు. అదే అతనికి మిగిలిన సంతృప్తి.

"ఏమండి డాక్టరుగారు నేను ఎప్పుడూ మీ దగ్గరే వుంటానా? నన్ను కొట్టరుగా? మా నాన్న మా అమ్మ యింటో ఎప్పుడు కొడతాడు. 'ఆయా' కూడా కొట్టేది. నాకు మా అమ్మను చూడాలనివుండండి ఒక్కసారి అమ్మను చూపి మళ్ళీ వచ్చేస్తాను మా అమ్మ దగ్గరకు ఎప్పుడు పంపుతారు" జ్ఞానం వస్తున్న దీపక్ జాలిగా అడిగాడు. పసి హృదయం అలాంటిది. తన కళ్ళ ఎదుటే తల్లి మంటలలో కాలి మట్టిలో కలసి పోయిందని జ్ఞానం కూడా రానివాడు. ఆ పసివాడు.

"తప్పు బాబు అలాంటి మాటలు అనకూడదు నేను వున్నానుగా నీకు తోడు. మనం షికారుకు వెళదామా? సినిమాకి



# ఓ తార కథ

వెళదామా రేపు చెప్ప బాబు," బాబుని మరపించటానికి ప్రయత్నించాడు రఘు

*     *     *

"పాపం అప్పుడు మన తోటలోకి వచ్చిన సినిమా యాక్టరు మాలతి చనిపోయింది దమయంతీ" ఎంతో విచారంగా అన్నాడు ప్రకాష్.

"ఎప్పుడు, ఎక్కడ చనిపోయిందండీ" ఆత్రుతగా అడిగింది దమయంతి. ఈ ఆస్పత్రిలోనే, పాపం ఎన్నో లక్షలు సంపాదించిందట, కాని ఏమి ప్రయోజనం! కనీసం చేసుకున్న భర్త కూడా రాలేదట. ఆవిడ సంపాదించే రోజులో ఆవిడ సంపాదన నంతా జల్సా చేసేవాడట, మాలతి భర్త. కాని ఆమె చనిపోయినప్పుడు అతనిలో కొంచెం మానవత్వం వున్నా ఆమె అంతిమ దశలో ఆమెదగ్గరే వుండేవాడు. ఇలాంటి మనుష్యులు కూడా ఈ ప్రపంచంలో వున్నారు." విచారంగా చెప్పాడు ప్రకాష్.

"మాలతి చిన్ననాటి స్నేహితుడట. ఆయన ఈ ఆస్పత్రిలోనే డాక్టరు. ఆయనే అంత్యక్రియలు చేయించాడు. మాలతిగారికి ఒక బాబు, చాలా ముద్దుగా వున్నాడు. ఎన్ని లక్షలు వున్నా, కనీసం ఆమెకు నా అనే వాళ్ళు లేకుండాపోయారు. దిక్కులేని చావు వచ్చిపోయింది. పూవు లాగా తనపరిమళాన్ని అందరికీ విరజిమ్మి చివరకు దిక్కులేని చావుకు గురియైంది." ప్రకాష్ జాలిగా అన్నాడు.

"పాపం, భర్త దగ్గరలేకుండానే ఆమె చనిపోయిందన్నమాట" విచారంగా అడిగింది దమయంతి.

"తాళికట్టిన భర్త దగ్గరలేడని మృత్యువు ఆగదుకదా" అన్నాడు ప్రకాష్.

"అయ్యో ఇటువంటి కష్టాలు పగవాళ్ళకి కూడా వద్దండీ" దమయంతి బాధపడసాగింది.

"ఆవిడలాంటి జీవితం కావాలని కోరుకున్నానుకదా" మనస్సులో అనుకుంది, దమయంతి.

"మనపాప ఏమంటుంది" పాపదగ్గరకు వెళ్ళాడు ప్రకాష్.

"ఏమన్నా తారకావాలి అనే మాట, అన వద్దండీ" దమయంతి అమాయకంగా అంది.

పరిస్థితుల ప్రభావాన్ని బట్టి మనుష్యుల వూహలు మారుతూ వుంటాయి.

"పోనీలే దమయంతీ అమ్మాయి గొడవ దేనికి. అమ్మాయి అమ్మ సినిమా తారలాగా వుందిగా నా కళ్ళకు" కళ్ళల్లోకి చూస్తూ భార్యను మురిపించాడు ప్రకాష్.

"చాల్లెండి అవ్వను పట్టుకుని వసంతం ఆడినట్లు" చిలిపిగా అదోలా మూతి పెట్టింది దమయంతి.

"అవ్వా! నీవు అవ్వవా – యింకానయం, నన్ను తాతయ్య అన్నావు కావు. త్వరగా తెముల్తే యింటికెళ్ళిపోదాం" ప్రక్కమీద కూర్చున్నాడు ప్రకాష్.

"అయ్యో అవతల కూర్చోండి, ఎవరైనా చూస్తారు. నేను బాలింతను" దమయంతి నోరు నొక్కుకుంది.

'అరే నిన్ను చూస్తుంటే బాలింతవో మరల మాలింతవో తెలియటంలా' నవ్వించాడు ప్రకాష్.

స్టాఫ్ నర్సు వచ్చి డిస్‌ఛార్జి రిపోర్టు యిచ్చింది:

ఇల్లు చేరుకున్నారు దమయంతి దంపతులు. "కాని మన తార కథ యింత విషాదాంతం అనుకోలేదు సుమండీ" అన్నది దమయంతి.

(అయిపోయింది)

## సామాన్యుని సణుగుడు

# "హవీజ్ దా...ట్?!"

"అందరికీ లోకువ యిండియా అయితే యిండియాకి నేను లోకువ అన్నట్లు న్యూజిలాండుండబట్టిగాని లేకపోతే యీపాటికి మనవాళ్ళు– క్రికెట్ పోటీల నుంచి మేం విరమించుకుంటాం– మా ఆడవాళ్ల టీము వెళ్ళిందిగా ప్రపంచ పర్యటనకి– యిక మీదట వాళ్ళకే వదిలేస్తాం అంటారేమో?" యిది జనవరి ఐదో తారీఖు మధ్యాహ్నం కలకత్తా టెస్టు కామెంటరీ వింటూ ఓ కాలేజీ అమ్మాయి– మరో ఆఫీసు గుమాస్తా– యింకో యిల్లాలు అనుకున్న మాటలు! వీటిలో ఆవేదన వుంది. వేళాకోళంగా కనపడొచ్చును యీ మాటలు బయటికి కాని లోపల లోపల ఎంతో ఉడుకుమోత్తనం ఉంది. దశాబ్దాలుగా మన వాళ్ళు క్రికెట్ ఆడుతున్నారు. 150 టెస్టు పోటీలు దాటారు. కాని గెల్చినవాటి సంఖ్య పాతికకి ముప్ఫయికి మధ్య మాత్రం వుంటుంది. ఇంగ్లండుతో మాత్రం నో యాభై ఆడారు. అందులో సగానికి ఒక్కటి తక్కువ వోడారు.

అసలు యిండియన్ క్రికెట్ అంత "ఎనిగ్మా" మరోటి వుండదు... రంజిత్ సింహ్ జీ, సీనియర్ పటౌడీ, కర్నల్ కనకయ్య నాయుడుగారు లాంటి మేరునగ ధీరులను గన్నదీ యీ భారతమాతయే, ఓపెనింగ్ బౌలర్లు లేక స్పిన్నర్లతోనే ఇన్నింగ్స్ ప్రారంభించేది మన దేశమే.

క్రికెట్ అంటే మన దేశంలో వున్నంత 'పిచ్చి' మరే దేశంలోనూ లేదు... క్రికెట్ అందమైన, దార్ఢ్యమైన ఆట. ఆట

అంతర్జాతీయ చలనచిత్రోత్సవం: రష్యన్ చిత్రం ఫరెవర్స్ ఫర్ బెటర్‌లో ఒకదృశ్యం



చూసినందుకే కాదు దాని గురించి కామెంటరి వినేవాళ్ళకి కూడా గొప్ప 'యిది'గా వుంటుంది. క్రికెట్ బొమ్మలు చూస్తే సినిమా స్టిల్సు చూసినంత థ్రిల్ వస్తుందని కూడా ఎందరో పాఠకులు రాస్తుంటారు... పేకాట ఆడేవాళ్ళైనా లేస్తారేమోగాని– కామెంటరీ వినేవాళ్ళు మాత్రం– అవతల కామెంటేటర్ "న్యూడియోకి మైకు యిచ్చేస్తున్నాను" అని నోరు మూసుకొనేదాకా చెవులు రిక్కించి

కొత్త మెత్తపడాలి ... దానిమీద మెరుగు తరగాలి ... అప్పుడు మెళికలు త్రిప్పుతారు కాని బంతి అప్పుడే కోసిన ఏపిల్ పండులా, తోమిన రాగిచెంబులాగ తళ తళ మెరిసిపోతూ వుంటే – మన చంద్రశేఖరో, బేడీవో దాంతో యిన్నింగ్స్ ప్రారంభిస్తే ... ఏం చేశాడు ఢిల్లీ టెస్టులో "అమిస్" 'ఫ్రా'వీని ఫూటుగా మొట్టమొదటి బంతితోనే లిన్నగా బౌండరీలైను దగ్గరికి కొట్టి – అది సరిగ్గా

కలకత్తా టెస్టులో రెండు పరుగులకే ఎలాన్ నాట్ అవుట్ అయ్యాడు. బేడీ వేసిన బంతిని గాలిలోకి నాట్ కొట్టాడు. గవాస్కర్ దానిని పట్టుకుంటున్న దృశ్యం.



పెట్టుకునే యిల్లాండ్రున్నారు... రిటైరైపోయిన బడి పంతుళ్ళున్నారు... సరేసరి– ఆఫీసు టైములో ఆటవిడుపుకు కామెంటరీ వింటే తప్ప కాగితంమీద కలం పెట్టని గుమాస్తాలున్నారు... కాలేజీలకి స్కూళ్ళకీ శలవే శలవు యిక–

ఒక్కో టెస్టు ప్లేయర్‌కి ఐదేసి వేల రూపాయల రోజుకూలి కిడుతుంది ... మరే ఆటలోనూ యిన్ని లక్షలమంది ఏకధాటిగా ఐదారు రోజులు మునిగితేలిపోతూ వుండరు కాని – దురదృష్టవశాత్తు యిండియాలో బ్యాటింగ్ ప్రారంభించటానికి యిద్దరు గట్టి గోడల్లాంటి బ్యాట్స్‌మన్ దొరకరు ... బౌలింగ్ ప్రారంభించటానికి బంతిని "రంయ్"మని విసరగల బౌలర్లు దొరకరు.

"అంతేనండీ మన వాళ్లకి 'వోపెనర్లు లేరు...అంతా మిడిల్ ఆర్డర్ బ్యాట్స్‌మన్' ఛేంజ్ బౌలర్లూను లేకపోతేనా ? ..." అంటాడు క్రికెట్ ప్రియుడు.

స్పిన్నర్లు బంతితో యింద్రజాలం చేస్తారు. ఎప్పుడూ? బంతి కొంచెం నలగాలి.

వుందో లేదో చూసిరమ్మన్నాడు ! ... అసలీ "అమిస్"ని మనవాళ్ళు "మిస్" చేసినన్ని సార్లు ఎవ్వరూ చేయలేదేమో.. మన ఫీల్డింగ్ కూడా యీసారి–స్పిన్నర్ల బంతులకు వాళ బ్యాట్స్‌మన్ తిరగాల్సివున్న మెళికలన్నీ యీఫీల్డర్లు చూపిస్తారా? అన్నట్లు మెళికలు తిరిగిపోడం – బంతులు వదులుకోడంతోనే సరిపోతోంది.

కలకత్తాలో 200 లు దాటి కొట్టాలంటే ఏ టీముకైనా కష్టమే ... అది బొంబాయిలాగ బ్యాటింగ్ పారడైజ్ కాదు... బౌలర్స్ పిచ్... కాని బేడీగారు ఏం చేశారూ తాను అలసిపోయేదాకా సోల్కార్‌ని అవతలకి పంపించి అదేపనిగా బౌలింగ్ చేశాడు. అప్పుడు ప్రసన్న వచ్చాడు... బేడీ జట్టు బౌలింగ్ ప్రతిభ బాగానేవుంది. ఎందుకంటే నేతులు జాచి మన స్పిన్నర్లను కొట్టే బ్యాట్స్‌మన్ ఎవ్వడూ లేకపోయాడు. "గ్రేగ్" వచ్చి ధైర్యంచేసి బాదేదాకా –

## సామాన్యుని సణుగుడు

కాని బ్యాటింగ్ సంగతే ... అదేమిటో తెలియదు ... "ఓపెనర్‌లు" లేరు మెయిల్ ఎండర్‌లు పడెంటేషన్ వికెట్‌ల లాంటి — వాళ్ళు. మధ్యవాళ్ళు ఫెయిల్ అయిపోతారు ఎప్పుడూ ... ఈ దుస్థితి తొలగేది ఎప్పుడు? దశాబ్దాలుగా మనకి ఫాస్ట్ బౌలింగ్ చేసేవాళ్ళు లేకపోతున్నారే...వాళ్ళని తయారుచేయటానికి క్రికెట్ కంట్రోల్ బోర్డు ఏం చేసింది...స్పోర్ట్స్ కౌన్సిళ్ళు ... డెవలప్‌మెంట్ కమిటీలు, గవర్నమెంట్ వీళ్ళంతా ఏం చేస్తున్నారు పక్కనున్న పాకిస్తాన్ యిరవై నాలుగ్గంటలూ చెవులు పిండి ప్రాక్టీసు చేయించి టీము తయారుచేసుకోడం చూస్తున్న మనవాళ్ళు కనీసం — యిన్ని రంజీ ట్రోఫీలు యెన్నో యితర కప్‌లు విజ్జీ ట్రోఫీల మ్యాచ్‌లు ఆడుతున్నారే దేశంలో వాటిల్లో ఫాస్ట్ బౌలర్‌లకి ప్రత్యేకంగా దోహదాలు యిస్తున్నారా? టీములో యిద్దరు ముగ్గురు ఫాస్ట్ బవులర్‌లు ... [అదే లోగడ రమేష్ దివేచా, దత్తూ ఫడ్‌కర్, రామచంద్ లుండేవారు ... వాళ్ళదే మనదేశానికి చివరి ఫాస్ట్ బౌలర్ టీము] వుండాలి— లేకపోతే రంజీ ట్రోఫీకు టీము తీసుకోం అనరేం... పోనీ మనది "హాట్ కంట్రీ" ఎంతసేపూ 'బెకులూ' 'డేకులూ' తప్ప— ఫాస్ట్ బవులింగ్ రాదూ అంటారేమో ...బ్యాటింగు సంగతి!? కాస స్పీడుగా బంతి వస్తూంటే దాన్ని భయంతో "స్లిప్స్" లోకి కత్తిరించి అక్కడున్న వాళ్ళ చేతుల్లో పడేయడమేగాని - ఎదిరించి "కవర్" డ్రయివో 'ఆన్' డ్రయివో చేయగల దీశాలు లేరే! పో... రానురాను మన క్రికెట్ కమ్మర్షియల్ ఏస్పెక్ట్స్ యింప్రూవ్ చేసుకుంటున్నారే తప్ప జెగజ్జెట్టీలు కాగల ప్రయత్నం మన వాళ్ళు చేయడం లేదు... అన్నది తేలిపోయింది...

క్రికెట్ ఫాన్స్ వేలాదిమందున్నారు. వీళ్ళు "ప్లేకార్డ్స్" పట్టుకుని "వుయ్ వాంట్ ఫాస్ట్ బౌలర్స్... వుయ్ వాంట్ స్ట్రాంగ్ ఓపెనర్స్" అంటూ అరుస్తూ క్రికెట్ స్టేడియంలో మధ్య మధ్యన చిన్న చిన్న ప్రదర్శనలిస్తే... ఎలా వుంటుంది... "సెక్షన్ థర్టీ" పెడతారా? క్రికెట్ స్టేడియమ్‌లో...

— వీరాజీ




"ఎల్లయ్యకి ఆకలితో కడుపు మండి పోతోంది! ఒంట్లో ఊపిరిలేని వాడిలా నిస్సత్తువతో తూలి పోతున్నాడు! కడుపు నిండా పట్టెడన్నం తినక సరిగ్గా పది రోజు లైంది. నాలుగు రోజుల క్రితం తిన్న ఎండి పోయిన రొట్టె ముక్కతోటే ఇంత వరకూ ప్రాణాలు నిలుపు కున్నాడు, టీనీళ్ళు తాగుదా మన్నా పది పైసలు కూడా దొరకలేదు. కడుపులో నరాలు మెలి తిరుగుతున్నాయి..."

గోడ గడియారం "ఠంగ్...." మని అరగంట కొట్టటంతో ఆలోచనలకి బ్రేక్ పడి రాస్తున్న కలాన్ని స్టాండ్‌లో గుచ్చి, బద్ధకంగా చేతులు వెనక్కి చాచి ఒళ్ళు విరుచుకున్నాడు ప్రముఖ రచయిత 'కథకశ్రీ'

కోడి పలావ్‌తో పేకల దాకా పూటుగా చేసిన డిన్నర్ మసాలా వాసనతో ఘాటుగా త్రేన్పు వస్తోంది!

తేరగా వచ్చింది కదా అని ఆబగా పెగ్గు మీద పెగ్గు పట్టించడంతో బ్రాందీ మాటి మాటికి నోట్లోకి కిక్కొచ్చి వెగటు వేస్తోంది! కళ్ళు ఎరగా కెంపు తేలి మత్తులో సోలుతున్నాయి శరీరం పట్టు తప్పి తూలుతోంది!......

సమయం అర్ధరాత్రి తర్వాత 12½ గంటలు...

హోటల్ రూమ్ నెంబర్ '8'లో కుషన్ కుర్చీలో కూర్చున్న రమణ్ మనస్సు స్థిమితం లేకుండా పోయింది?

రెండు రోజుల క్రితం పని వుండి హైదరాబాద్‌కి వచ్చాడు. తెల్లవారు ఝాము నాల్గు గంటల బస్సుకి ప్రయాణం. చెయి తిరిగిన ప్రముఖ విప్లవ రచయితగా, సినీ కవిగా రమణ్‌కి వున్న పేరు సామాన్యమైంది కాదు. ఊరు ఊరా వాడవాడా ఆయనకి అభిమానులున్నారు. ఎన్నో రచనలు ఇతర భాషల్లోకి కూడా తర్జుమా అయ్యాయి.

ప్రముఖ రచయిత "రమణ్" ఎప్పుడు వచ్చినా ఆ "పోష్" హోటల్‌లో తప్పించి మరెక్కడా దిగడు! అది ఆయన అలవాటు!...

వచ్చిన పని ముగిసింది. అసలు న్యాయంగా రాత్రికే వెళ్ళిపోదామనుకున్నాడు. కాని కొన్ని అనివార్య కారణాల వల్ల ప్రయాణం మర్నాటికి వాయిదా పడింది!

పైగా నిన్నటి సాయంత్రం అతని ప్రాణ మిత్రుడూ ప్రముఖ పత్రికా సంపాదకుడూ ఐన "సంజీవరావ్" కలిశాడు.

"పత్రిక జన్మదిన సందర్భంలో ప్రత్యేక సంచిక తీస్తున్నాను. "ఆకలి" మీద విప్లవ ధోరణిలో ఏదైనా ఒక మంచి కథ రాసియ్యి" అని "రిక్వస్టు" చేశాడు.

"ఇంటికి వెళ్ళి పంపిస్తాను' అన్నాడు రమణ్.

"అమ్మమ్మా! వీల్లేదు. పత్రిక ప్రెస్సుకి కూడా వెళ్ళిపోయింది. నువ్వు వెంటనే రాత్రికి రాత్రే ఆర్టికల్ తయారు చెయ్యక తప్పదు నీలాంటివారు తల్చుకుంటే అదేమంత కష్టంకాదు. ప్లీజ్ నాకోసం ... అంటూ గెడ్డం పట్టుకునే మరీ బ్రతిమ లాడాడు.

"నిజమే! ఇంటికి వెళ్ళాక మాత్రం తనకెన్ని వ్యవహారాలు? నిజానికి జీవరావు ఈ విషయం తనకి నెలాఖర్ల క్రితమే ఇన్‌ఫామ్ చేశాడు కాని తను ఊపిరి సలపని పనితో ఇంతవరకూ ఆర్టికల్ అందివ్వలేక పోయ్యాడు. తను ప్రముఖ రచయిత అయ్యుండి ప్రాణమిత్రుడి అభ్యర్ధన కాదన

## ఆకలి కథ

టం సమంజసం కాదు" అనుకుని ప్రయాణం మర్నాటికి వాయిదావేసి రాత్రికి రాత్రి కలంపట్టక తప్పలేదు రమణ్ !

కాని శరీరం అందుకు ఎంతమాత్రం అనుకూలించటములేదు!?

సంజీవరావు తినిపించిన డిన్నరు ఘనంగా సంతృప్తికరంగానే వుంది. త్రాగించిన బ్రాందీ నిషా బాగానే తలకెక్కింది. కాని కలంలోంచి కవిత్వం మాత్రం జారటంలేదు! ఎక్కడి కక్కడ ఆలోచన్లు మొరాయిస్తున్నాయి! 'పాత్రలు' కదలమని హారం చేస్తున్నాయి.

"ఛా.. ఛా... మూడ్సు బాగాలేదు ..." కణతలు రుద్దుకున్నాడు రమణ్.

రెండు రోజుల్నుంచి 'విశ్రాంతి' అన్నమాట లేకుండా తిరిగి తిరిగి వున్నాడేమో... మెత్తటి యూ ఫోమ్ బెడ్‌ని చూస్తుంటే నిద్ర ఆగనంటున్నది! కడుపు నిండుగా వుండేసరికి కళ్ళు మత్తుతో మూతలుపడి పోతున్నాయి.

విల్లయ్య ఆకలి మంటతో ఎలా దహించుకు పొయ్యాడో. కనీసం టీ నీళ్ళు త్రాగటానికి పది పైసలు కూడా దొరక్క ఎట్లా అలమటించి పొయ్యాడో, ఆకలి మంటలో సమాజాన్ని ఎలా దుమ్మెత్తి పోశాడో, ఘరానా బాబుల డబుల్ని ఎలా బ్రవేలెత్తి చూపాడో, చివరికి దొంగగా, ఖూనీకోరుగా ఎలా మారి పొయ్యాడో సవివరంగా చిత్రీకరించాలని, సంఘంలోని లోటుపాట్లని పాఠకులముందువుంచాలని ఆచిన్న కథ ద్వారా ఒక గొప్ప సత్యాన్ని (నీతిని) సందేశంగా అందించాలని రమణ్ ఉద్దేశ్యం! కాని ఎక్కడి కక్కడ ఆలోచన్లు సమ్మెచేస్తున్నాయి!

'వెధవ ఆకలి కథ' రాయటం కోసం ఇంతగా తపన పడి బుర్ర బద్దలు కొట్టుకున్న క్షణాలు గతంలో లేనే లేవు!' అసహనంగా విసుక్కున్నాడు రమణ్.

జేబులోంచి సిగరెట్ తీసి లైటర్‌తో వెలిగించుకున్నాడు. ఒక్కసారి గట్టిగా దమ్ము పీల్చి దీర్ఘంగా ఆలోచిస్తూ గోడ పైపు దృష్టి నిలిపాడు!

'ఓ లేజవ్వని తన ఒంటి ఒంపులన్నీ అర్ధనగ్నంగా ప్రదర్శిస్తూ జలపాతం క్రింద జలకాలాడుతున్న దృశ్యం...' అందంగా పెద్ద ఫ్రేమ్‌లో బిగించబడి వుంది! ఆ హోటల్ ప్రొప్రయిటర్ అభిరుచిని మనస్సులోనే అభినందించాడు రమణ్!

రెప్ప కొట్టకుండా ఆ దృశ్యాన్ని తిలకిస్తున్న రమణ శ్రీ గారికి కాలమే తెలియక పోను. కాని .. సన్నగా గాజుల గలగల శబ్దం కావటంతో చప్పున తల తిప్పి చూచాడు.

గది తలుపులు లోసుకుని ఓ సుందరాంగి నవ్వుతూ లోపలికి అడుగు పెట్టింది.

రమణ శ్రీ గుండె లయ తప్పింది;

కళ్ళు ఆశ్చర్యంతో విచ్చుకున్నాయి:

"ఎంత అందం!?' రోలోన ముగ్ధుడయ్యాడు:

ఒక్కసారి బిడియంగా మునిసిగ్గుతో ఓరగా చూసి తల దించుకుంది సుందరాంగి.

రమణ్ గుండెలకి "గాలం" పడింది ఆశగా నాలికతో పెదవులు రాచుకున్నాడు.

అది కలో... నిజమో తెలుసుకోలేని తన్మయావస్థలో పావు గంట సేపు చిత్త రువులా అలాగే కుర్చీకి అంటుకుని వుండి పోయ్యాడు!

చిరుగాలి సవ్వడిలా సుందరాంగి నవ్వింది

వులిక్కి పడ్డాడు రమణ్ !

ఆమె రెండు అడుగులు ముందుకి వేసింది.

"అసలు మీరు మగవారేనా!?" కీరవాణిలా వినిపించింది ఆమె స్వరం.

రమణ్ అహం దెబ్బతింది!

"ఏమిటీ ? నన్నేనా అడుగుతోంది?" వులికి పాటుగా గదంతా కలయ చూచాడు.

"ఇంకెవరున్నారని ? నన్నే ....." విసురుగా సిగరెట్ గిరాటేసి చిపుక్కున కుర్చీలోంచి లేచి ఆమె ముందుకి వచ్చి బలంగా తన రెండు చేతులా ఆమె భుజాలు గుచ్చి పట్టుకున్నాడు!

"అనుమానమా?" అన్నాడు సూటిగా ఆమె కళ్ళల్లోకి చూస్తూ ఆ కళ్ళలో "ఆకలి" స్పష్టంగా ప్రతిఫలించింది. కోరికలో అతని శరీరం దహించుకు పోతున్నది. దాహంతో తపిస్తున్న వాడిలా నాలికతో పెదవులు చప్పరించాడు.

"మరి ఏమిటి? నేను వచ్చి పావు గంట అయినా వులకూ...పలుకూ.. లేకుండా ..."

రమణ్ తలుపుకున్న బోల్ట్‌వేసి లైట్ స్విచ్ మీదకి చెయ్యి పోనిచ్చాడు !

ఆ చేతిని మృదువుగా అడ్డగించింది

'లైటు తీస్తారా ?'

"ఏం వదా ?"

"కాదు. తీసేముందు ఓ వంద రూపాయలు నా చేతుల్లో పెట్టి ఆ పని చెయ్యండి..."

"ఎందుకు ?" తెలిసీ చచ్చు ప్రశ్న అడిగాడు.

చురుగ్గా తలెత్తింది ఆమె!

"ఎందుకా ? మీ ఆకలి తీరటం కోసం నా ఆకలి ఖరీదు ..." ఒక్కొక్కమాట పదునుగా పలికింది!

రమణ్ మెదడులో 'మెరుపు' మెరిసింది!

కథకి ఇన్స్పిరేషన్ దొరికింది

మారు మాట్లాడకుండా జేబులోంచి పర్సుతీసి ఆమె చేతుల్లో పెట్టి లైట్ ఆఫ్ చేశాడు!...

* * *

ఆ మర్నాడు బస్సెక్కే ముందు "సెండాఫ్" ఇవ్వటానికి వచ్చిన సంపాదక స్నేహితుడికి "ఆకలి" కథ యొక్క స్క్రిప్టుని చేతుల్లో పెట్టాడు.

కాని అది గంజినీళ్ళకి కూడా నోచుకోని 'ఎల్లయ్య' ఆకలి కథ కాదు. ఒక అందమైన అమ్మాయి లాడ్జింగులకి అమ్ముడుపోయిన ఆకలి కథ!

ఎంతో కుతూహలంతో స్క్రిప్టు తెరిచిన సంపాదక మహాశయుడు, నేను రాయమన్నది 'ఈ ఆకలి' గురించా ? "హా! కలి" అని తల పట్టుకున్నాడు!

## స్కోరెంత ?-7

ఆడాళ్ళకి 'గాసిప్' అంటే మహా సర్దా అంటారు. బొంబాయి సినిమా రంగం—సినిమా పత్రికా రంగం దాకా యిది నిజమేనా అనిపిస్తుంది. "గాసిప్" స్టార్స్‌లో చాలా ప్రముఖమైన 'స్టార్' శోభా కాళీచంద్ అంటారు. 'స్టార్‌డస్ట్' పత్రిక చదివే వాళ్ళకు యీమె స్కోరు బాగ తెలుస్తుంది. శోభా కాళీచంద్ పై స్కోరు చేయగల "అమ్మలక్కలెవ్వరూ" వుండరంటున్నారు. అలాగే "స్టార్ అండ్ స్టైయిల్" గాసిప్ కాలమ్స్‌కే కొన్నాళ్ళు పేరుంది.

ఇందులో ఎస్ భారతి రాసే గాసిప్ కోసం వెయ్యికళ్ళతో ఎదురుచూసేవారున్నారు శోభాకాళీచంద్ మధ్యవయస్కురాలైతే భారతి పైలావచ్చీ పిల్లా అంటున్నారు. ఆ తర్వాత దేవయాని చౌబాల్‌కి గాసిప్ మేకర్‌గా మంచి పేరుంది ఈవిడ కూడా నేను రాసినట్టు గాసిప్ ఎవ్వరూ రాయలేరంటుంది. కాని దురదృష్టవశాత్తూ మన 'సౌత్'లో 'గాసిప్' గర్ల్స్‌కి ఛాన్సు లేకుండా పోతోంది ... [★★★]





# ఫాలాకు ని డైరీ

(7 వ. పేజీ తరువాయి)

## 30 ఏళ్ళుగా జైల్లో వున్న హిట్లర్ సన్నిహితుడు

1946 నుంచి నేటి వరకూ యింకా ఖైదులో కాపురం ఉంటున్న నాటి యుద్ధ ఖైదీ ఒకేఒకాయ నున్నాడట. ఆయనపేరు రూడాల్ఫ్ హెస్సిన్నట. వయస్సు 82 ఏళ్లట. ఈయన హిట్లరు సన్నిహితులలో మొట్ట మొదటివాడట.

## ఖాతాదార్లకు కపోతాల ద్వారా సేవ!

బ్యుయి నోస్ ఎయిరిస్ నగరంలో ఓ మందుల షాపాయన తనవద్ద వాడుకగా మందులు కొనేవారికి మందులు పావురాల ద్వారా పంపుతున్నాడట.

## బ్రిటన్‌లో భారతీయ వైద్యుల పరిస్థితి

బ్రిటనులోని భారత దేశీయులైన డాక్టర్లు ఇండియాకు తరలివచ్చెయ్యడమా, లేక అక్కడే తమ డాక్టరు వృత్తి వదలి వేరే వృత్తి చేపట్టడమా అని ఆలోచనలతో సతమత మవుతున్నారట.ఎందువలన ఆలోచిస్తే అక్కడ కొత్త నిబంధనలూ వగైరా మనదేశపు డాక్టర్లను సావకాశంగా ఉండనిచ్చేలా లేవుట— రానానూ ఇండియా యీజా బెటరంటూరంతా !

## బ్రిటిష్ పార్లమెంటులో పురిటికందు

ఇంగ్లండులోని లేబర్‌పార్టీకి చెందిన 27 ఏళ్ల ఎం. పి. హెలెన్‌హేమన్ అనే ఆవిడ తన కూతురు పదిరోజుల పసికందును కూడా తనతో పార్లమెంటుకు తీసుకు వెళ్తుందట. అక్కడో ఉయ్యాల పెట్టి, అందులో పడుకోబెట్టి పిల్ల కుయ్యిమన్నప్పుడల్లా వెళ్లి పాలిస్తుందటావిడ.

## గుండెజబ్బు కనిపెట్టే కాగితం !

ఏ వ్యక్తయినా గుండెజబ్బుతో బాధపడుతూ ఉన్నాడా అన్న విషయం కనుగొనడానికి స్వీడన్ వైద్యశాస్త్రం ఒక అమోఘమైన పరికరాన్ని కనిపెట్టారట. వారు ఒకరకం కాగితాన్ని తయారు చేశారట. ఆ కాగితాన్ని రోగి మూత్రంలో నానేస్తే హృద్రోగం ఉన్నట్టయితే ఆ కాగితం రంగుమారుతుందట. దీనినిబట్టి ఆ వ్యక్తికి గుండెజబ్బుఉన్నట్టు కాగితం రంగు అధికమవడాన్నిబట్టి ఆ రోగం ఎంత తీవ్రస్థితిలో ఉన్నదీ కనిపెట్టగలరుట వారు — హేట్సాప్ టుది సైన్స్ !

## కళ్ళూ, చెవులూ వున్న కారు !

ఆస్ట్రేలియాలో ఒక ఇంజనీరుగారు ఎలక్ట్రానిక్ కారును రూపొందించారట. ఆ కారులోకూర్చుని ఇంజను స్టార్టుచేసి "ఊ పద" అంటే బయల్దేరుతుందట. "కాస్త త్వరగాపో" అంటే త్వరగా పోతుందట "నెమ్మది" అంటే నెమ్మదిగా పోతుంద "ఆగు అంటే ఆగుతుందట. మనం చెప్పే ఆజ్ఞానుసారం ఆ కారు వెళ్తుందట. పైగా రోడ్డు సిగ్నల్స్‌ను పాటిస్తుందట. ఎర్రలైటు చూస్తే తనకు తానే ఆగిపోతుందట.

## సంరక్షకుని వియోగభారంతో ప్రాణత్యాగం

పిసా, ఇటలీలో ఇక్కడి సర్కస్‌కు చెందిన సంద అనే ఏనుగు తన సంరక్షకుడు దూరమయ్యాడన్న విచారంతో ఆహారం మానివేసి చివరకు ప్రాణత్యాగం చేసింది. జర్మనీ దేశస్థుడైన ఆ యువకుడు ఒక ఇటాలియన్ వనితతో వివాహానంతరం ఇటీవల స్వదేశం వెళ్లిపోయాడు.

## లండన్‌లో 3 వేల భారతీయ హోటళ్ళు !

లండనులో భారతీయులకు చెందిన, అనగా భారతీయులు పెట్టిన హోటళ్లు మూడు వేలున్నాయట. బ్రావో ! !

## లాటరీలో నష్టం !

బీహారు రాష్ట్రంలో ఆ రాష్ట్రం నడిపిన లాటరీ టిక్కెట్ల పథకంవల్ల ఆ రాష్ట్ర ప్రభుత్వానికి రెండుకోట్ల రూపాయలు నష్టం వచ్చిందట. లాటరీ టిక్కెట్ల ఏజంట్లు తాము తీసుకున్న టిక్కెట్లకు డబ్బులేని బ్యాంకులలో చెక్కులురాసి ప్రభుత్వానికిచ్చారట. ఈ విషయం శాఖ, టిక్కెట్లమ్మకం వేరేశాఖ అవడంవల్ల చెక్కులు తిరిగొచ్చేవైనం టిక్కెట్లమ్మేశాఖకు తెలియనందువల్ల ఆ శాఖవారు టిక్కెట్లిచ్చేశారట. బోల్డు సొమ్ము. ఇదిగాక యీ ప్రభుత్వ లాటరీ టిక్కెట్లు అచ్చువేసే చోటే దొంగలాటరీ టిక్కెట్లు కూడా హోముటావారు. ఎంచక్కాగా అచ్చు వేయించుకున్నారట. వీటివల ఆ ప్రభుత్వానికంత నష్టమట.

## సినిమా పత్రికల ఆధిక్యత !

మన భారతదేశంలో పదమూడు భాషలలో మొత్తం ఆరువందల సినిమా పత్రికలు వస్తున్నాయట. ప్రపంచం మొత్తం మీదున్న అన్ని దేశాలలోని సినిమా పత్రికలూ కలిపినా మన అంకెకు చేరవు అపటాని ఇలస్ట్రేటెడ్ వీక్లీలో కుష్వంత్ సింగ్ అన్నారట.

## దేశంలో 60 లక్షల మంది పిచ్చివారు

అఖిలభారత దేశంలో యీనాడు అరవై లక్షల మంది పిచ్చివారున్నట్టు తత్సంబంధమైన లెక్కలు తేల్చి చెప్పాయట.

## బొంబాయిలో మూడు వంతులకి పైగా క్షయ రోగులు !

బొంబాయిలో వుండే వారిలో 36.2 శాతం జనాభా క్షయ రోగం ఉన్నవారేట. దీనిక్కారణం బలమైన ఆహారం లేక పోవడం, దొరికినాహారంలో పోషక పదార్థాలు లేకపోవడం, జనులు నివసించే పరిసర ప్రాంతాలు శుద్ధంగా లేక పోవడమే యీ రోగం రాడానికి కారణాలట !




## ఉత్తరాలు:
## పాఠకులకు మనవి

- ★ ఉత్తరాలు క్లుప్తంగా తెలుగులో వ్రాసి చివర స్పష్టంగా తమ పేరు చిరునామా వ్రాయాలి.
- ★ సంతకాలు పెడితే పేరు అర్థం కాదు కనుక దాని క్రింద పూర్తి పేరు కూడా వ్రాయాలి.
- ★ ఉత్తరాలు తిప్పి పంపమంటూ కొందరు తపాలా బిళ్లలు పంపుతున్నారు. ఉత్తరాలు తిప్పి పంపడం సాధ్యం కాదు.
- ★ వచ్చిన అన్ని ఉత్తరాలు వేయడం ఎప్పుడూ సాధ్యం కాదు. కొన్నింటిని సంక్షిప్తం చేసి వేయవలసి ఉంటుంది. కూడా. ఏ ఉత్తరమైనా వ్రాసేవారి చిరునామాతో కూడా ఉండటం అవసరం. — సం

### అట్టమీద బొమ్మ

సంక్రాంతి సంచిక చూసిన తరువాత నామనస్సులోని భావాలకు ప్రతిరూపమే ఈ ఉత్తరం.

సంక్రాంతి సంచిక ముఖచిత్రం ఆకర్షణీయంగానే ఉంది. కానీ చిత్రానికి అందం తెచ్చేవి కేవలం రంగులే కాదు, రమణి కూడా. చిత్రంలో ఉన్న స్త్రీకి పెదవులు చిత్రించకుండా వ్రాయడం, మోడరన్ ఆర్ట్ కావచ్చు, కానీ ఆ పెదవులు గీయకపోవడంతో ఆ రమణికి అందం లోపిస్తున్నదన్న విషయం కూడా చిత్రకారులు గమనించాలి.

ఇక కథలు— నాలుగూ నాలుగు రకాల ఇతివృత్తాలతో చిత్రింపబడి వెరైటీగా ఉన్నాయి.

మొదటి కథ పట్టుంబన్ను బాగుంది కానీ కథకు వేసిన బొమ్మలో చిన్నలోపం దొర్లింది. కథలో రచయిత మోహోదు కొడుకుని తెల్లని షర్టు, నల్లని ఫేంటులో టక్ చేసినట్లు వ్రాస్తే, చిత్రకారులు ఏకంగా తెల్లనిబట్టలే, ధరింపజేశారు. [కొంచం నల్లరంగు పులిమేస్తే పోయేది].

జ్యోత్స్న, కె. సూర్యనారాయణ, [రాయగడ]

### సీరియల్

ఈవారం [7—1—77] వెలువడిన పత్రిక మీద ప్రచురించిన పద్మశ్రీ అక్కినేని నాగేశ్వర్ రావుగారి ముఖచిత్రం అత్యంత ఆకర్షణీయంగా వుంది. కథలు చాలా బాగున్నాయి. "మగదిక్కు" కొత్త సీరియల్ ప్రారంభంలోనే మమ్మల్ని ఆకట్టుకుంది. సినిమా శ్రీవాస్ గారికి మా ధన్యవాదాలు.

కె.ఎస్.యమ్., [వరంగల్]

### కథలు

7—1—'77 సంచికలోని సంగీతపుజల్లు కథలోని సుబ్బారావుకు తన భార్య ప్రెగ్నెంట్ కాదని తెలుసుకోవటకు ఆమె 5 నెలలుగా బహిష్టు అయినదీ లేనిదీ అన్న అనుమానం రాలేదా అని వా సందేహం. సామాన్యుని పలుకుడు లేని లోటు బాగా కనబడింది. స్కోరెంత శీర్షిక నాకు నచ్చలేదు. వర్తమాన తారలతో ప్రశ్నలు — జవాబులు శీర్షిక ప్రారంభించమని కోరుతున్నాను.

ఆచంట సుబ్బారావు, (నర్సాపురం)

సంక్రాంతి సంచికలో సత్యం మందపాటి తన సృష్టి కథలో చాలా మందపాటి సత్యాన్ని అత్యంత హాస్యంగా అందించారన్న నిజం తెలుపటానికి ఈ లేఖకు నా కలం వెనుదీయటంలేదు. పత్రికా సమీక్ష కుడ్ని కూడా కలిపితే మరింత నిండుతనం వచ్చి ఉండేదన్న నిజం నలుగురూ అవునంటారనే ధైర్యం ఈ కలానికి ఉంది. కె. భరణిశ్రీ, [వినన్నపేట].

సంక్రాంతి ముగ్గులతో వెలువడిన 14 వ తేదీ సంచిక ఆకర్షణీయంగా వుంది. నాలుగుకథలు వేసినందుకు కృతజ్ఞతలు. కథల్లో సృష్టి కథ ఈతరం నటీనటుల పిచ్చి అభిమానులు తప్పకుండా చదువతగ్గది. మనచిత్రరంగ పరిస్థితి ఎంత హీనస్థితికి దిగజారిందో ఈ కథ చక్కగా వివరిస్తుంది. ఈ కథను సృష్టించిన సత్యం మందపాటి గారికి, అందించిన మీకు మా ధన్యవాదాలు. పద్మావతీ విలాస్ కథ గూడా మాకు బాగా నచ్చింది. మగదిక్కు సీరియల్ ఉత్సాహకరంగా సాగుతోంది. యస్. హర్‌బన్స్‌సింగ్,

వై. అశోక్‌కుమార్, [కరీంనగర్].

ది. 7—1—77 సంచికలో ప్రచురింపబడిన కలకాలం నిలిచిన ఒక ప్రేమకథ చాలా అసహజంగా ఉంది. రచయిత్రి వసుంధర గారు పవిత్రమైన ప్రేమను అతి ఘోరంగా హత్య చేశారు. రచయిత్రికి ప్రేమ పవిత్రత తెలిసినట్లు లేదు. ప్రేమను బజారు వస్తువుగా, ఆటబొమ్మగా కట్టి విడిచే బట్టగా చిత్రీకరించింది. దానికి ఒక ఘోరమైన పేరు కలకాలం నిలిచిన ఒక ప్రేమకథ పేరుకు, కథకు సంబంధం లేని రచన యిది.

ముమ్మనేని నానాజి, (వరంగల్)

### ధర్మసంధం

7—1—'77 నాటి ముఖచిత్రం చాలా బాగుంది. కథలు మూడు ముత్యాలలాంటివి. ... క్షని డైరీ,లోకంపోకడ చాలా ...



బులుసు వెంకట రమణయ్యగారి ధర్మపథం శీర్షికలో ధర్మాన్ని, సత్యాన్ని, నీతిని, నిజాయితీని, స్వేచ్ఛా మరియు స్వాతంత్ర్యాన్ని వివరంగా ప్రతి వారం వివరిస్తున్నందుకు మా కృతజ్ఞతలు.

అబ్దుల్‌సలాం, ఎస్.హర్‌బన్‌సింగ్, కె.చిన్నయ్య పి. లింగన్న, వై. అశోక్‌కుమార్, యమ్.వి. ప్రతాప్, (కరీంనగర్)

### డాక్టర్ సలహాలు

శ్రీనాగేశ్వరరావుగారి ముఖచిత్రంతో వెలువడిన పత్రికలో వైద్య సలహాలు శీర్షికలో మూర్ఛవ్యాధికి గురించి ఒకపాఠకుడు అడిగిన ప్రశ్నకు డాక్టర్‌గారు ఇచ్చిన సమాధానం ఎంతమాత్రము తృప్తికరంగా లేదు. మూర్ఛ [ఎపిలెప్సి]కి అడ్రసు కార్డు రోగి జేబులో ఉంచడం తప్ప వేరేమార్గం లేదనడం ఈ సైన్సు యుగంలో ఒక డాక్టరుగా చెప్పాల్సిన జవాబు కాదు. మద్రాసులో ప్రొఫెసర్ బి.రామమూర్తి గారు ఇలాంటి ఎపిలెప్సీ [ మూర్ఛ ] వ్యాధి నయం చేస్తున్నారు. మాతమ్ముడికి చిన్నతనం నుంచి ఫిట్స్ వచ్చేవి. గతసంవత్సరం మద్రాస్‌లో డా. రామమూర్తి వద్ద ఆపరేషన్ చేయించి ఆయన యిచ్చిన మందులు వాడాము. ఇప్పుడు ఆజబ్బు ఛాయలు కూడా మాతమ్ముడిలో లేవు.

జి. అనంత, [ రాజమండ్రి. ]

## అవీ-ఇవీ-అన్నీ

### శ్రీ తేకుమళ్ళ రాజగోపాలరావు శతజయంత్యుత్సవ సంచిక

తెలుగు భాషకు, సంస్కృతికి మిక్కిలి సేవ చేసిన శ్రీ తేకుమళ్ళ రాజగోపాలరావు శతజయంత్యుత్సవాల సందర్భంగా ప్రచురించిన ఈసంచికలో ఆయన గురించి ప్రముఖులనేకులు వ్రాసిన వ్యాసాలున్నాయి. 1/4 డెమ్మీ సైజులో 58 పేజీలున్న ఈసంచిక వెల తెలియదు. ప్రతులకు తేకుమళ్ళ రాజగోపాలరావు శతజయంత్యుత్సవ సంఘము, పెరుమపల్లివారి వీధి, విజయవాడ—2 అని వ్రాయవచ్చును.

### ఖడ్గనారాయణము

పద్యకావ్యము. రచన : శ్రీ కోటగిరి విశ్వనాధరావు, 76 పేజీలు, వెల మూడు రూపాయలు. ప్రతులకు : రచయిత పేర జిడగమువారి వీధి, సూర్యారావుపేట, విజయవాడ—2.

### కారల్ మార్క్సుకు కమ్యూనిస్టులు పట్టించిన గ్రహణం

వ్యాససంపుటము. రచన : శ్రీ ఎస్. ఇన్నయ్య 44 పేజీలు వెల 2 రూపాయలు. ప్రతులకు : తెలుగు విద్యార్థి ప్రచురణలు, మచిలీపట్నం—521 001.


**Printed and Published by S. NageswaraRao at the Andhra Patrika press, MallikarjunaRao Street, Gandhinagar, Vijayawada-3. Editor: S. Radhakrishna**



'మనస్సాక్షి' లో ఉమ

